సంగీత

# శ్రీకృష్ణరాయబారము

గ్రంథకర్త:

వి. యస్. మూర్తిగారు



ప్రకాశకులు:

ఈశ్వర బుక్ డిపో,

రాజమహేంద్రవరము.

# జ్ఞానకృష్ణలీల

పండిత. కే. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

ఈనాటకము భారతగాథాను సరణమేయైనను కవి తనస్వకపోల కల్పితంబగు చమత్కారంబున నమోఘంబుగ రచియించి యున్నాడు. ఇది జ్ఞానోపదేశకరంబగు గ్రంథమని నీవెఱుంగుట సులభముగాదు. నీదినభుక్తి పరిమాణమును నాల్గింతలుచేసి 5 దినము లుపవాసముండియైన నీనాటకముచు జదువవలసినదే. ఇందుప్రథమాంకమున సత్యభామాకృష్ణభగవానుల సరస సల్లాపము, దుర్యోధనుడు నిండుసభలో కాబోవు యుద్ధవిషయ మాలోచించుట, పాండవులకు వ్యతిరేకముగ యుద్ధమొల్లుచేతునాయని తల్లడిల్లు భీష్మునకు రుక్మిణీకృష్ణులు దర్శనమిచ్చి తత్త్వోపదేశము చేయుటయు, రెండవయంకమున కృష్ణు డర్జునునకు గీతల నుపదేశించుట, కృష్ణుడు కర్ణున కాతని జన్మరహస్యమును దెలుపుట, పాండవులు భీష్మాగ్నికి తాళజాలక భీతిల్లుటయు, మూడవయంకమున పాండవుల శిబిరప్రాంతమున పాంచాలీ దుర్యోధను లొకరినొకరు తిట్టుకొనుచు కత్తులతో పోరాడుట, అందు స్త్రీవధ మహాపాతకమని యడ్డువచ్చు దుర్యోధనుని కొడుకు మణిభద్రుడు మరణించుట భీష్మమరణాంతమువరకు నైదంకములలో వ్రాయబడినది. కవియాంధ్రనాటకములను రచించుటలో పేరుమోసినవాడు. చదివిచూచినగాని తృప్తినొందరు.

వెల రు 1—0—0

---

ఈశ్వరబుక్‌డిపో, కర్రాఅచ్చయ్య అండ్ సన్సు, రాజమండ్రి.

సంగీత

# శ్రీకృష్ణరాయబారము

గ్రంథకర్త

వి. యస్. మూర్తిగారు.



ప్రకాశకులు,

ఈశ్వర బుక్కు డిపో,

[illegible] అండ్ [illegible] 1889

ప్రొప్రయిటరు:- కిరాళి మావుళ్ళయ్య,

రాజమహేంద్రవరం.

1939



[వెల —12—0

# ఒక్క మాట.



భారతరామాయణ గాథల నెవరెన్ని రీతుల రచించినను తద్గ్రంథములందలి యభిమానాదరణంబులే కారణంబులని జగ మెఱుంగనిది కాదు. కృష్ణరాయబారము లిదివరకు గొన్నియున్నను నాభారతకథాభిమానమే యాగౌరవమే నన్నిందులకు బ్రోత్సహించినది. దానికి బ్రకాశకుల ప్రోత్సాహము తోడైనది. దీనియందు నాటకలక్షణాది దోషంబు లేవేని కొన్నియుండిన చదువరులైన బుధవరులు తెలిపినచో సవరించుకొందును. ఈనాటకముయొక్క సర్వహక్కులును ప్రకాశకులకే చెందియున్నవి. వారి యనుమతినంది ప్రదర్శకులాడుకొనవచ్చును. వారియనుమతిలేనిదే యెవరును ప్రదర్శింపరాదని వ్రాయుట నావిధి.

ఇట్లు,

బుధజనవిధేయుడు,

గ్రంథకర్త.

# ఈ నాటకమున వచ్చు ముఖ్య పాత్రలు.

## పురుషులు.

1 కృష్ణుడు
2 ధర్మరాజు
3 భీముడు
4 అర్జునుడు
5 నకులుడు
6 సహాదేవుడు
7 దుర్యోధనుడు
8 కర్ణుడు
9 ధృతరాష్ట్రుడు
10 విదురుడు
11 భీష్ముడు
12 ద్రోణాచార్యుడు
13 కృపాచార్యుడు
14 అశ్వత్థామ
15 నారదుడు
16 భరద్వాజుడు
17 మహేంద్రుడు

## స్త్రీలు.

1 ద్రౌపది
2 గాంధారి
3 కుంతీదేవి

శ్రీరస్తు

సంగీత

# శ్రీకృష్ణ రాయబారము.

—♦ నాంది ♦—

మ. శ్రీకృష్ణాయమభూషణా నరసఖా ♦ శృంగారరత్నాకరా
లోకద్రోహినరేంద్ర వంశదమనా ♦ లోకేశ్వరా దేవతా
నీకబ్రాహ్మణగోగణార్తిహరణా ♦ నిర్వాణ సంధాయకా
నీకున్ మ్రొక్కెద ద్రుంపవే భవలతల్ ♦ నిత్యానుకంపానిధీ

(నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించి సభికులపై పూవులను జల్లి)

సూత్ర—ఆర్యమహాజనులారా! మీ రెల్ల రవ్యాజకృపాపరాయణులరై మాయం దభిమాన ముంచి మాయాహ్వానమున కిచ్చట కరుగుదెంచిన మిమ్ము సంతోషపెట్ట దలంపున ధన్యతమంబైన శ్రీకృష్ణరాయబారనాటకంబును ప్రదర్శింపదలంచితిమి గావున సావధానమతి నవధరింప వేడుకొనుచున్నాను. (సభలో కరతాళధ్వనులు కాగా వినుట నభినయించి ప్రకాశముగా) ఆ? ఏమనుచున్నారు? గ్రంథకర్త యెవ్వరనియా? చిత్తము. చెప్పెద నవధరింపుడు.

గీ. పరమపావనంబైన వెం ♦ ప్రాంగలము
నందు ప్రభవమందిన వాడు ♦ యవనిసురుడు
సూర్యనారాయణాఖ్యుడు ♦ సజనహితుడు
బహుళసద్గ్రంథవిరచనా ♦ పారగతుడు.

(తెరలోనుండి)

ఆర్యా! లోన పాత్రవర్గము సంసిద్ధమై నాటకము ప్రదర్శింప వేగి రపడుచున్నారు. జాగుచేయక సభాస్తారులనుండి శెలవు గైకొని రండు.

సూత్రి—మంచిది. (సభికుల నుద్దేశించి) మహాజనులారా! సావధానముగా మాప్రదర్శన మాద్యంతము దిలకించి ప్రమాదము లుజ్జగించి మంచి గైకొని మమ్మానందింపుడు.

(సభలో కరతాళధ్వను లగును.)

సూత్రి— చిత్తము. శెల వొసంగుడు. లోనికిపోయి ప్రదర్శన మారంభింపింతును.

(అని నిష్క్రమించును.)

(తెరవాలును.)

—♦ ఇది ప్రస్తావన ♦—



శ్రీరస్తు.

సంగీత

# శ్రీకృష్ణరాయబారము.

## ప్రథమాంకము.



1 వ రంగము—ద్వారకానగరము బయలు.

( ప్రవేశము—అర్జునుడు. )

అర్జు:—(పరిక్రమించి) ఆహా! యేమి యీద్వారకానగర సౌం దర్యము వర్ణనాతీత మైనదిగదా!

(1 వ, అనుబంధము)

సీ. అల్లదే! ద్వారక నవ్య ♦ హర్మ్యంబులు
చూడ్కికగపకు విందు ♦ చూఱబెట్టె
అయ్యవే! నందనో ♦ ద్యానవనంబులు
గనినంతసంతోష ♦ కలన మించె
అవిగో! గవీబృంద ♦ మావాసముల జేర
బోవుచుండుటజూడ ♦ పొలుపు మిగిలె
రాధామనోహరు ♦ రాజభవన మద్దె
కన్నులపై కుంత ♦ గరిమ హెచ్చె

గోగ్రహణమునాఁడు ♦ కురుకులాంభోనిధి
గడచితి నెవ్వాని ♦ కరుణఁజేసి
ఆ. వె. 'కర్ణసింధురాజ ♦ కౌరవేంద్రాదుల
తలల పాగలెల్ల ♦ దడవి తెచ్చి
యేమహాత్ము బలిమి ♦ నిచ్చితి విరటుని
పుత్రి యడుగ బొమ్మ ♦ పొత్తికలకు.'

అట్టి మామకహృదయైకపరాయణుఁడగు శౌరి యమ్మహాకురుమహాసంగ్రామసాగరమును డిగ్గి యుద్ధరింపకుండునా? 'తినఁబోవుచు రుచి యడుగనేల' యన్నట్లు లోకింతసేపటిలో సర్వమును విదితముగాక యుండునా? (ఇంచుక తలఁచి) నాకన్న ముందుగా శ్రీకృష్ణుని సహాయము వేఁడుటకుఁ జని మఱియు విరోధియగు దుర్యోధను ద్వారకాపురము ప్రవేశించెనని గదా వినియుంటిని. ఒకవేళ నాకన్న ముందుగా నాతఁడు వచ్చెనని గోపాలుఁ డాతనికి యభయహస్తమిచ్చునా? ఎట్లిచ్చును? మాకుఁ గారణమాతఁడే కదా? ధర్మము విడిచిపెట్టుండునా? కానిమ్ము. పలుమాటలేల? సర్వమిక్క యుచితసమయమునందే తెలియఁగలదుగదా! (ముందునకుఁ బరిక్రమించి) అదిగో! రాజప్రాసాదము సమీపించితిని. నేనింక రాజభవనప్రవేశము గావించెదను గాక!

(అని నిష్క్రమించును.)

2 వ రంగము—శ్రీకృష్ణుని శయనమందిరము.

(ప్రవేశము: శ్రీకృష్ణుఁడు పరుండియుండ దుర్యోధనుఁడు తలవంక కూర్చొనియుండును.)

దుర్యో—(తనలో) నేను వచ్చి యప్పుడే సుమారొకగంట కావచ్చినది. ఈ శ్రీకృష్ణుఁ డింకను నిద్రనుండి మేల్కొనలేదు. లేపినగో

నిద్రాభంగ మగునని చింతింపవలసివచ్చినది. (విసువుచు) అబ్బా! పరాపేక్షవలస నెంతయవస్థ గలదు. నాయంతటి రారాజే యదూద్వహులములను, ఈ సామాన్యకృష్ణుని యాచింప వలసివచ్చినదిగదా? నా కీకృష్ణుడు సంపూర్ణముగ సహాయము గావించునను నుద్దేశమున వచ్చియుండలేదు. ఈతఁ డెప్పటికిని పాండవపక్షపాతియే! అయినను లోకుల కీతని పక్షపాతబుద్ధి దెల్లము గావింపవలయుననియే నే నిట్లు గావించితిని. (కృష్ణుని జూచి) అదిగో! కృష్ణుడు కదలుచున్నాడు. ముం దతడే నన్ను గాంచి కుశలప్రశ్నము నడిపిన తరువాతనే నేను ప్రత్యుత్తరమొసంగెదనుగాక!

కృష్ణు:— (కపటనిద్ర నటించుచు తనలో) ఈదుర్యోధనుడు నాసహాయ మపేక్షించి యేతెంచినాడు. అర్జును డింకను రాలేదు. కారణ మవగత మగుట లేదు. (ఇంచుక తాళి) ఆ! వచ్చినాడు. మద్ద్వారసమీపభూమి కిప్పుడే వచ్చినాడు. పూర్వపరిచితు డగుట నందరను సమాధానపఱచి వచ్చుచున్నాడు. యీదుర్యోధనుడును నాయర్జునుడు నొక్కతరినే పురిప్రవేశము గావించియున్నారు. కాని దుర్యోధను నెవ్వరింతగా నెఱింగినవారు లేకుండుటవలన త్వరితముగా నన్ను దర్శింపగలిగెను. క్షణమునకో యరక్షణమునకో నాతడును రాగలడు. అంతవఱకు నే నిట్లు కపటనిద్ర నటించెదనుగాక!

అర్జు:—(ప్రవేశించి) అదిగో! అనుకొనిన ట్లాదే దుర్యోధనుడు నా కన్నముందుగనే ప్రవేశించి యీగోపాలశేఖరుని తలయంపి నాసీనుఁడై యున్నాడు. (కృష్ణునివంకకు దరిసి) మాబావ శ్రీగోవిందుడు నిద్రించుచున్నాడు. నేనును పాదములచెంత వసించి యాతనిమేలుకువకై వేచియుండెదనుగాక! (అని శ్రీకృష్ణునిపాదములచెంత నిలువబడును.)

కృష్ణః:—(నిద్రనుండి యర్జునునివైపునకు లేచి తొలుత యర్జును నిగాంచి ప్రకాశముగా) బావా! అర్జునా! నీవు వచ్చి యెంతసేపాయెను.

శా. బావా! యెప్పుడువచ్చినావు సుఖులే ♦ బంధుల్ హితవ్రాతమున్?
సేవల్ సేతురె సేవకావళి మిమున్ ♦ జిహ్మంబున న్నమ్మి మీ
రావంతైన విచారముం గనక బ్ర ♦ హ్మానందులై సోదరుల్
గావా! మాచెలియందు ప్రేమవతులే ♦ పార్థా! వచింపంగదే!

(అని వెనుకకు తిరిగి దుర్యోధనునిచూచి ప్రకాశముగా ఓహో! శ్రీదుర్యోధనసార్వభౌములు విచ్చేసితిరే? ఎంతప్రమాదము సంభవించినది? తొలుత మిమ్ము జూడనైతిగదా? బావా దుర్యోధనరారాజా! నీవువచ్చి యెంత తడవైనది? నీవింతవఱకెచ్చట నుంటివి? మనవారెల్లరికును సేమమేనా? పూజ్యుడగు ధృతరాష్ట్రమామకు సుఖమేగదా? పూజ్యురాలు గాంధారీయత్తకు కుశలమేనా? పెద్దలగు భీష్మ ద్రోణ కృపాచార్య అశ్వత్థామ, బాహ్లీక ముఖ్యులు సుఖంబుగా నున్నారా? విశేషము లేమి?

దుర్యో:— శ్రీకృష్ణా! మావారెల్లరును సుఖులై మహానందసందోహకందళితహృదయారవిందులై యున్నారు నీవు నారాకకు కారణ మడిగితివి. చెప్పెద నాలకింపుము.

గీ. మాకు నీధూర్తులకును ♦ సమరమ్ము వచ్చె
ఇది చిరాగతమ్మాట నీ ♦ కెఱుకగాదె
నీవు మాయిరుకక్షుల ♦ కెన్నివిధుల
నొక్కపోలిక గావున ♦ జక్క వినుము.

మాకు జరుగనున్న నీమహాయుద్ధమున నీసహాయము నపేక్షించి యిప్పుడే యొక్కగంటకుముందే యిచ్చటకు వచ్చి నీనిద్రాపరిసమాప్తి

కెదుటఁ జూచుచున్నాను. నీవు విజ్ఞానసముద్రుఁడవు. ధర్మాధర్మము లెఱిగిన మేటివి. న్యాయ మాలోచించి నిర్ణేత ధర్ముఁడవు గమ్ము.

అర్జు:—

శా. బావా! యిప్పుడె వచ్చినాను సుఖులై • బంధుల్ హితవ్రాతమున్
సేనల్ సేతురు సేవకావళి ముఖుల్ • క్షేమమ్మునన్ సమ్మి మా
కాపంతేసి విచారముం గలుగ దా • సందప్రబోధాత్ములై
బావా! నాయనుజన్ములుందురు సుఖ • శ్రీఁ జొప్పు మీవారికిన్
నావచ్చిన పనినిగూర్చి విన్నప మాలకింపుము.

గీ. ఈసుయోధనాదులు మమ్ము • నెవరు లేక
గుడువఁ రాష్ట్రి కష్టముల్ • గూర్చువిధము
యెఱుగనే నీవు నదియంత • యిపుడు దాని
ప్రతిఫలంగాచు సమరంబు • వరుస గలిగె.

కావున ధర్మరహస్య మెఱింగి మాయిర్వురందు నొకింతైన యే వారి ధర్మముగలదో యరికించి వారికి సహాయుఁడవు గమ్ము.

కృష్ణ—పాండు సుయోధనులారా! మీయిరువురు వచించిన పలుకులను సావధానంబుగా వింటిని. ధర్మాధర్మములు విచారించుట కిది యదనుగాదు. మీయిరువురును నాకు సమానమే కాని యిరువురకు నిట్టివిషయమున సహాయము గావించుట సాగనేరదు గదా? కావున నే నొక్క విధానము జెప్పెద. దానికి సమ్మతింపుడు.

అర్జు—అవశ్యము సమ్మతింతును.
దుర్యో—నీయిష్టము వచ్చినట్లనే గావింపుము.
కృష్ణ—అట్లయిన వినుడు.

క. 'నాసాటియ పదివేవురు
గోపాలురు గలరు సమర • కోవిదబాహా

టోపాభిరామమూర్తులు
చాపాధ్యాయుధ కళా వి • శారదచిత్తుల్.'

కర్యము చేయు నా నారాయణాభిధాను నొకవంక నుందురు. నేను నిరాయుధుండనై హితవ్యాపారమతినై యొకవంక నుందును. మీయిరువురందును యీపార్థుడు వయస్సున చిన్నవాడు గావున తొలు నొ వితండే కోరుకొనుట బాగుండును.

దుర్యో:—కృష్ణా! నీపక్షపాతనైజము మానవైతివి. మాయి రువురందును ముందు నేనుగదా వచ్చితిని. అట్టినాకు తొలుత గోరుకొ నుట జెల్లునుగాని పాగునకు జెల్లునా? సుంత ధర్మము పరికింపనైతివి గదా?

కృష్ణు:—దుర్యోధనా! నీ వన్నది సత్యమే? అయిన నొక్క విశే షము గలదు చెప్పెద నాలింపుము.

"ఉ. నీవిట మున్న వచ్చితివి • నిక్కము పార్థుని దొల్త గాంచితిన్
గావున మీకు నిద్దరకు • గౌరవ మొప్పగ దోడుపాటు స
ద్భావము, దీనికిం దెలుగు • దప్పకయుండగ నేర్పరించితి
న్నీవల పిన్నలట్ల తగు • నీయెడ పార్థుడుగోర శార్ఙ్మణీ!"

దుర్యో:—సరే! కృష్ణా! నీయిచ్ఛ వచ్చినట్లనే గావింపుము. ఆమంచి చెడ్డలు నీకే గలుగగలవు.

కృష్ణు:—బావా! సుయోధనా! నాకుమాత్రమీయు యుక్తాయుక్త ములు దెలియ వలుకొంటివా? పార్థా! నీవంతు గోరుకొనుము. సరిగ జెప్పెద. మఱల నవగాహనము గావించుకొనుము. పెక్కుమ ది మహావీరు లును రణవ్యాపారపారీణులును, ధర్మవర్తనులు, స్వామిహితైక పరా యణులునునగుగోపాలసైన్యవారధి యొక్కవంక, నిరాయుధుండనై యు ద్ధము సేయని నేనొకవంక. యిం దేది లాభదాయకిమో చింతించుకొని మఱి గోరుకొనుము. మించిన పిదప విచారించిన లాభము లేదు.

దుర్యో:—(తనలో) ఈకృష్ణుడు తన్ను గోరక గోపాల సైన్యము గోరుకొమ్మను సుద్దేశమును సూచించుచున్నాడు. అన్నా! పక్షపాత మన నిట్టిందనుగదా? కానిమ్ము. పర్యవసాన మెట్లు కలుగునో పరికించె దనుగాక.

అర్జు:— బావా! నందనందనా? నీవు పరమాదరంబున గోరుకొమ్మనుటవలన నానందపయోరాశిం దేలియాడితిని. కావున గోరుకొనెదను గాక.

గీ. విక్రమాటోపవరులైన ♦ వీరులైన
వివిధశస్త్రాస్త్రసంగర ♦ ప్రియులునైన
వలదు గోపాలబల మయ్య ♦ వాసుదేవ!
యాశ్వరానీవు నా కుండ ♦ నితర మేల?

కావున నిన్నే కోరుకొంటిని. మీరుమాటాడక నామనోభీష్టంబు నెరవేర్పుము.

దుర్యో:— (తనలో) వహ్వా! నానోములు పండినవి. విజయ సూచిక మిట్లుగదా నుండవలయు (ప్రకాశముగా) కృష్ణా! అట్లులైన గోపాలబల మంతయును నావశము గావింపుము. నాకు చాలతొందరప నులు గలవు. త్వరితముగా బోవలయును.

కృష్ణు:— సరే! అట్లనే గైకొందువుగాక! అగునుగాని యిప్పుడే పోవలయునా? భోజనము గావించి పో వలనుపడదా?

దుర్యో:— వలనుపడదు. నాకు చాలపను లున్నవి. మఱొ కప్పుడు వచ్చినప్పు డాకపూటగాదు. సావకాశముగా బదిపూట లుం దును లెమ్ము పోయెదను. (అని లేచి) సెలవా?

కృష్ణు—నీవట్లనిన నే నేమనగలను?

దుర్యో—కృష్ణా! నీవు మరియొకవిధముగా దలంచుకొనకుము. యీసారి వచ్చినప్పుడు తప్పక యుందును లే? (అని నిష్క్రమించును.)

కృష్ణు—బావా! అర్జునా!

క. 'నారాయణ గోపాలుర
భూరిపరాక్రముల గురువి ♦ భుడు నొన సంగ్రా
మారంభరహితు నన్నుం
గోరికొనుట నీవు మేల ♦ గున దలపోయన్?'

అర్జు—బావా! నందనందనా! నేను సహాయము నపేక్షించి నిన్ను గోరికొనుటలేదు. వారి నుపేక్ష సేయలేదు. మాకెవ్వరిసహాయమును వలదు. నీవు మహానుభావుడవు. దివ్యప్రభావ సంపన్నుడవు. విజయమూలాంకురమవు. ని న్నాదరించి విజయ మందుట నా కిష్టములేదు. యుద్ధము సేయని న న్నేల గోరికొంటి వంటివి. దానికి ప్రత్యుత్తరము చెప్పెదను వినుము. నీవు యుద్ధము చేసితివా ప్రసిద్ధంబగు యశము నీకే దక్కును గాని మావరకును రాదు గావున నీ వని సేయకుండుటయే నా కభిమతంబు. కావున నీవు నాయందు బ్రసన్నభావ మలంకరించి;

క. 'సారథ్యం బొనరింపు మ
పారకృపాలీల నెల్ల ♦ భంగుల నాకా
గౌరవమును బరకాలము.
గోరినయది దీని నిమ్ము ♦ గుణరత్ననిధీ!'

కృష్ణు—అర్జునా! నీయభిమతి మవశ్యము చేర్తును గాక! నీవు కోరినయట్లు నీకు రథచోదకుడ నై సాధ్యమగునంతవరకు జయము నీకు గూర్చెదనుగాక!

అర్జు—బావా! కృష్ణా! ధన్యోస్మి! ధన్యోస్మి!

కృష్ణు—సరే! రమ్ము. వంటశాలకుం జని విందారగింతము. మనకై బలరామసాత్యకి ప్రభృతు లెదురు చూచుచుందురు. రమ్ము పోవుదము.

(అని యిరువురు నిష్క్రమింతురు.)

(తెర వాలును.)

కృష్ణ:— యుధిష్ఠిరా! నీయభిమతం బేదియో చెప్పుము. తప్పక నెరవేర్తును.

[illegible]:—అన్నా! ఈమహానీయుని యభిమతి మేమని నీ వడుగుచుంటవా? నేన చెప్పెద నాలింపుము. నిన్నగాక మొన్ననే సంజయుని మూలమున నాధార్తరాష్ట్రులకు సంధివిషయము రాయబార మంపినారు. ఆసంజయు డచ్చట నుండి వచ్చి "యాధార్తరాష్ట్రు లెన్నివిధముల ప్రయత్నించి చెప్పినను సంధి కయ్యకొనుట లేదు మీకు సామ్రాజ్యమున సాబాలు గావలసియున్న పోరు గావించి వారల నిర్జించి సుఖించునది. గా దందురేని మునుపటియట్ల కానల కరగి యాకలంబుల దినుచు నష్టకష్టంబుల బడునది" యని వచించినాడు. యుద్ధంబు పైకి బుద్ధిపోక యీధర్మ సంభవు డిల్లు తల్లడిల్లుచుండె. తిరిగి వనవాసమున కిష్టపడుచుండెనేగాని యుద్ధమనిన నేమో నచ్చుట లేదు.

కృష్ణ:—ద్రుపదనందనీ! యాతనియభిమత మాతనినోటనుండియే వచింప నిమ్ము.

ధర్మ:—గోపాలా! మే మాదుర్యోధనుని బంధుహిత పరిజనంబుముందట నయిదూళ్ళ నిమ్మని సంజయునిమూలంబున రాయబార మంపినది సత్యమే కాని:—

'శా. ఆదుర్యోధను డంతమాత్రమును జే ♦ యంజాలడో కాని పెం
దం బూరత నోర్వరాదు సిరి నా ♦ కేలందు నే గ్రాసవా
సో[illegible]వ్యంబులు వచ్చినా యరయు నీ ♦ చుట్టాలకుం గావునన్
మోదం బందుట గల్గు గౌరవులు నే ♦ ముంబొంది శ్రీనొందినన్'

మఱియు

'ఉ. అక్కట లాతునైన బగ • తైనను జంపన కోరనేల? గయుం
డొక్క తెఱంగు లేదె యది • యొప్పది బంధుసుహృజ్జనంబు లా
దిక్కననున్నవారు గణు • తింపక సంపదకై వధించి దూ
ఱెక్కట దోషమందుటను • నీదురవస్థల కోర్వవచ్చునే?'

కటకటా! క్షత్రధర్మ మెంతకఠిన తరమైనది. కులధర్మము విడువగుండవలెనన్న శస్త్రము పట్టితీరవలయుగదా? దానివలన బంధుహితాప్తవర్గవినాశమును మనస్తాపమును సిద్ధించు. వంశనాశనము నా కిష్టము గాదు. కావున ధర్మగతి నీవు కౌరవులపాలికి బోయి సంధిప్రయత్నము చేయుము.

'చ. మనమున బక్షపాతగతి • మాని సమానుము ధర్మనీతివ
ర్తనముల రెండుదిక్కుల హి • తంబును, బెంపును గల్గునట్టి పో
ప్పున విదురాదిసజ్జనుల • బుద్ధికి రా నుచితంబుతోడి మె
ల్పున బరుసందనంబునను • భూపతు లెల్ల నెఱుంగ నాడుమీ!'

ఓ శ్రేయోదాయకా! మాకు జుల్కదనంబుగాని తెఱంగున నెంత వినయముగా బల్కవలయునో నట్లు బల్కి యెట్టులైన నాసుయోధను నొప్పింపుము. మాయుభయ వంశంబుల గౌరవంబును గాపాడుము.

కృష్ణు:—ధర్మనందనా! నీనిశ్చితాభిప్రాయమునకు నామనంబమితాశ్చర్యసంభ్రమములు గలిగించుచున్న దేల నందువా?

"మ. గురుభీష్మాదులు సూచుచుండ, సభ మీ • కుం గీడు నాడట్లము
ష్కరులై చేసిరి యంతసేసియును బ • శ్చాత్తాపమున్ బొందనో
పరు వారెన్నడు నట్టిచోట గృపయుక్ • బంధుత్వముం దక్క మె
వ్వరు గోపింపరె యాదు నాత్మకులగ • ర్వాకౌర్యముల్ సూచినన్."

కపటనేత్రంబునెపంబుగా మమ్ముల వెడలనడుచునప్పుడు, దుర్యోధన దుశ్శాసన శకుని సూతనందనులు పురిలోపలదక్కి కలకల నవ్వుచుం బలికిన పలుకు లుగ్గడింపవచ్చునే? వాని విని సమస్తజనంబులు ధృతరాష్ట్రుని నిందించుచు, మీరు బలవంతులై యుండియు, సత్యంబు పాటించి యూరక పోక నూరకుండి, యుద్ధోత్సాహములో నున్నమిమ్ములించుచుండిరి. తెల్లవారంగ నోయెడివారు పోరాటములో మున్ను చేసియుండుదురుగావున, వారిలానాటిపంజులకన. పాపాత్ములగు కౌరవు లెల్లవారికిని వధ్యులగుదురు. నాకు సవిస్తరంబుగా దెలియం బలుపుడు. నీకేల యువధ్యులైరి. పాపాత్ములగు హింసకులా బాముల నెట్లట్లు నిర్విచారంబుగా వధించుట కర్తవ్యంబు. పోనిమ్ము నా కేమి? నీచెప్పినవొప్పున నే గావించెద. గురుభీష్మద్రోణవిదురాదిపెద్దలముందర నీపనిచిన యర్థంబు విన్నవించెద. దానికి దుర్యోధను డియ్యకొనక మిమ్మెల్లను దూఱునాడు. దాని కావృద్ధులు వానికెల్లయిసను సి కది గాదని హితవు చెప్పుదురు. దాని కాతండు చెక్కుగొనఁడు. వృద్ధరాజు పుత్రవ్యామోహము సంజేసిమారుమాటాడకుండు. గాన మన కేమిలాభంబు సిద్ధింపగలదు. ఏమైనను నేను నాకర్తవ్యము నిర్వర్తించెద. మీరలు మాత్రము చతురంగబలంబులు సమకూర్చుకొని యుద్ధమునకు సన్నద్ధులై మాత్రముండుడు. (అనిభీమునివంక నలసత్వముగా చూచును.)

భీము:—ఏమి శ్రీకృష్ణా! యుద్ధసన్నద్ధులు గమ్మని మమ్ము బెదరించుచుంటివా? నిన్ను మాయన్న సంధికి బుత్తెంచుచున్నా డన్నంత మాత్రమున మే మంత పరాక్రమహీనులమని తలచితివా? కాదు. మా కాకౌరవుల నిశ్చితార్థపాత్రయు మెరుగజాలంది గాదు.

శా. పాపాత్ముంగుమదాంధు డాతులువ సీ ♦ పంపెల్లనుం చేయగా
నోపం డప్పుడు సెప్పవ్వరును మా ♦ నోద్రేకముల్ గర్వముల్

గోష్ఠంబున్ దనుదిర్చిప్ప నాప్తజనులం ♦ గుందించుటం బోయిన
స్త్రీ పోనిత్తురుగాన నిన్నతిండు జా ♦ లింకెట్లెదుం జూడుమిా.'

మఱియు,

'ఉ. పాండవకౌరవుల్ గలసి ♦ పాలును నీరును బోలె నెమ్మమై
నుండగ దుష్టచేష్టల సు ♦ యోధను డింతలుసేసె నాత డా
కృండ కిలక్షయంబునకు ♦ గారణ మంచొర్చిది తెప్ప దైన నీ
వొండనవేల యాబిరుగు నోపినయంతయు ♦ దిద్దునేర్పునన్.'

అదియునుంగాక మాకును వారికింగూడ బితామహుండగు భీష్మండు వినుచుండ నానుయోధనుతోడ నావచనంబులుగా నిట్లు బలుకుము.

'గీ. అన్నదమ్ములకై యుండి ♦ యొకట మనల
నోరులు దలయెత్తిచూడ ♦ నోండ్రగులతోడం
బెనగనేటికి నీవేల ♦ పెద్దవారి
బుద్ధి విని పంచి కుడుమిట ♦ పోలనొక్కొ?'

అని యేవిధమునకైనను వానికి నయభయంబుల నచ్చజెప్పి సంధి పొసంగించి మాయుభయ కులగౌరవంబులం గాపాడుము.

కృష్ణు:—

'ఉ. యుద్ధమువిూది వేడ్కయు మ ♦ హోగ్రవిరోధుల నల్కజేయు ద
ర్పోద్ధతియున్ సుయోధనుని ♦ యున్నతి నుష్పనియేవు రాజ్యసం
సిద్ధి; నిజాగ్రజన్మునకుం ♦ జేయుతలంపును గల్గు నీవసం
బద్ధము లైన వాక్యములు ♦ వల్కుటగొప్పునె పంచకాంతరా!'

ఔరా! వెఱపెఱుంగని నీకు సహిత మిప్పట్టున ధార్తరాష్ట్రుల తోడి యుద్ధమనిన నెంతదిగులుపుట్టి పిరికివచనంబు లాడుచుంటివోయీ! బావా! వృకోదరా! నీ వింతటిభీరువువని తలంపనైతినిసుమా?

(అని నవ్వును)

భీమ:—ఏమి మధుసూదనా! యేమనుచుంటివి? నేను భీరువు నయియా?

'ఉ. బంటుతనంబు మాటలకు బాఱకు ♦ పాండునృపాలు పాలుగై
కొంటయచాలు నన్ను నృప ♦ కుంజరుపల్కుల కడ్డమాడరా
కుంట యెఱుంగవే మును ను ♦ యోధనుచందముఁజూపి యప్పుడే
మంటి యుపేంద్ర! న న్ననిర ♦ గాగ్రమునన్ విను మందలించెదన్.'

నాశక్తి యెఱుంగక నీ విట్లు పలుకుదువా? ఔరా! యేమి నీప్రగల్భములు. నీవు నొకశూరుడవసియే తక్కుల్లు మాకు దీర్పదలంచితివా?

సీ. గోపికాకాంతలఁ ♦ గూడి సయ్యాటలఁ
బొద్దుపుచ్చెడు నీవు ♦ పోడవగుదె?
గోపబాలురగూడి ♦ గోబృందముల్ గాన
మేపుచుండెడు నీవు ♦ మేటివగుదె?
వెన్నపాల్ మీగడ ♦ వేతలమందున
దొంగిలించెడి నీవు ♦ దొరవు నగుదె?
మాయజిత్తులు పన్ని ♦ మహితారివర్గంబుఁ
బరిమార్చిన ట్టీవు ♦ ప్రభుఁడ వగుదె?
గీ. చాలు! చాలూరకుండుము ♦ మేలు! మేలు!
మరచినాడవే యని బరి ♦ మార్చినట్టి

వారలను జరాసంధాది ♦ ప్రథితశూర
వరులసంగతి సుంతిలో ♦ నరయువలదె?

ధర్మ:—తమ్ముడా! భీమసేనా! శాంతింపుము. శాంతింపుము. నీక్రోధమున కిది సమయము గాదు.

భీ:—ఎందుల కీపనికిమాలిన శాంతి. తొలుత నుండియు నీశాంతియే మనల కింతలేసి ముప్పులకు గారణభూతమైనది.

సీ నాకు విషము వెట్టి ♦ యంబుల జేకాళ్లు
గట్టిదోయించిన ♦ కాలమందు,
కల్లజూదంబును ♦ గల్పించి మనకల్మి
సకలంబు పడదిన్న ♦ సమయమందు,
చెఱగుమాసిన కాంత ♦ చేలంబులను నిండు
సభలోన విప్పెడు ♦ సమయమందు,
అజ్ఞాతవత్సర ♦ మందున మనపై కి
దురముసేవచ్చిన ♦ తరుణమందు,

తే. శాంతమో శాంతమం చీవు ♦ సంతతంబు
చంపుకుని దిన్న కతనాన ♦ సంభవించె
యిపుడు వారితో యింతగా ♦ యిాదుకులజ
మరల నాశాంత మేలయ్య ♦ మహితచరిత!
కావున నిక శాంతియను మాట కల్ల?

అర్జు:—అన్నా! వృకోదరా! పూజ్యులమాట యతిక్రమింపజెల్లునా? మనవంటివారే యన్నమాట నతిక్రమింతుమేని లోకమున మరియన్నలమాటల విని ధర్మము నిలువబెట్టు వారుందురా? మరియొక్కటి?

తే. ప్రథిత వీరాధి వీరులౌ ♦ పాండుసుతులె
యగ్రజునిమాట నిరసింప ♦ యవనిలోన
మనల మంతింప వారెవ్వ ♦ రనల నేఁచి
పల్కుచుందురు గావున ♦ వలయు క్షమము.

అదియునుంగాక మన కనేకోపకారములను గావించిన నీమధుసూదను నీకరణి తూలనాడుట భావ్యమగునా? శాంతింపుము.

నకు:— అగ్రజా! బకాసురమర్దనా!

గీ. చిన్నతనమాదిమనల నీ ♦ వెన్ని పెల్లు
భంగులను గాచి బ్రోచితి ♦ వాడుకాద
అట్టిమేనమామందొ హా ♦ స్యంబుకొఱకు
పలికితివి పల్కులకిప్పు ♦ డలుగ నగునె?

సహ:— అన్నా! జరాసంధసంహారా! తమవంటివారికి కనిస్నేహితుక కోపము గల్లునా! కావున శాంతి వహించి ముందు కర్తవ్య మాలోచింపుడు.

ద్రౌప:— (దుఃఖము ప్రదర్శించుచు) అన్నా శ్రీకృష్ణా! శౌర్యవంతమగు పాండవపంచకము పరాభూతమైనది. నాబన్నముదీర్పువా రెవరు? నాడు నాడుసభలో చెఱఁగుమాసిన నన్ను వివస్త్రం జేయఁదలంచి నాశిరోజములువట్టి యీడ్చు దుశ్శాసనుండు లాగుతరి నూడిన నాయీశిరోజములు నేనాదుశ్శాసనునిరక్తముతోఁగాని ముడువనని ప్రతినజేయ నప్పుడే వృకోదరుండు నాదుశ్శాసనుని జంపి తద్రక్తమున నాశిరోజములను సవరించి ముడివేయింపింతునన్న ప్రతిజ్ఞావచనంబులు పటాపంచలైనవి. నాదుఃఖపరిసమాప్తి యెట్లు కాఁగలదు. నే నింకెట్లు జీవింపఁగల్గుదును. (అని యేడ్చును)

కృష్ణు—అమ్మా! ద్రౌపదీ నిన్నించుక యూరడిల్లుము. సర్వము కాగ లదిసవ్యముగానే కాగలదు. నడుమ నీపోరలకు విచారింపకుము. వృకో దరా! నప్పటాలకు నేనాడిన యల్కుల కింత యలుక పడవలయునా? (నీము నితో) మంచిది మీరాయిచ్చవచ్చినట్లనే సంధికార్యము నడపివచ్చెదను. మీ మీసందేశములను తెల్పుడు.

ధర్మ—శ్రీకృష్ణా! యింక చెప్పుటకేమున్నది? సర్వము తొలుతనే వచించితినిగదా? పెమ్మట నీబుద్ధికి తోచినట్లు సంధనడపుము సాధ్యమగు నంతవఱకు శాంతముగా ప్రవర్తించి సంధియగు ప్రయత్న మాలో చింపుము.

కృష్ణు—వృకోదరా! నీ సందేశమది?

భీము—గోపాలా! నన్ను పదేపదే యేల రేపొడుదవు. నావచన ములుగా నిండుసభలో నాసుయోధనున కిట్లు చెప్పుము.

గీ. ధర్మసంభవు వాక్యంబు ♦ దప్పకున్కి
సంధికేమిట్టు లాడబడు ♦ సమయమయ్యె
గానిచో నిన్ను మన్నిదా ♦ ఘూటముననుఁ
తొడలు పగిల్చి నీసర్వంబు ♦ దోమికుందు.

కృష్ణు—మంచిది. అర్జునా! నీ నేమందువు?

అర్జు—నీకు చెప్పవలసినదంతయును పూజ్యులగు ధర్మసంభవ వృకోదరులు సెలవిచ్చియేయున్నారు. గావున సమస్తంబును నీకే వలి యగిల్లైదన నే నోకించుక చెప్పెద నాలింపుము వారలమున్న మాటల సంపన్నములు చాలవరకు సెరింగియున్నవారు గావున నీవు పోయినంతనే తప్పక సంధి కియ్యగొందురు నెంతదూరమో పోవ నేను మున్ను జరిగిన యుత్తరగోగ్రహణ సమయంబున వారు మనలావు పూర్తిగా గుర్తించి యున్నారుగదా? ఎట్లన—

ఎంతటిమహోన్నతజీవికకు నాయుట్టిదానికి నెంతటిభంగపాటు సంగటిల్లినది.

చ. వరమునఁ బుట్టితిన్ భరత ♦ వంశముఁజొచ్చితి నందు బాండుభూ
వరునకు గోడలైతి జన ♦ వంద్యుల బొందితి నీతివిక్రమ
స్థిరులగు పుత్రులం బడసి ♦ తిన్ సహజన్ములప్రాపు గాంచితిన్
సరసిజనాభ యిన్నిటను శ్రే ♦ ష్ఠ నెక్కినదాన నైతయున్.

రాధామనోహరా! నీవునన్ను సుభద్రకన్న నెక్కుడుగా మన్నించువాఁడ వగుటంజేసి నాబన్నంబుల నొకించుక స్మరణకు రా నివ్వవలసినది. ఆనాఁడు దుర్మార్గులు చెఱగుమాసిన వనితనైయున్న భావింపక కేశముల పట్టి సభ కీడ్చించి నాకు గావించిన పరాభవమునకు నీకృప లేకున్న మానభంగము గావలసినదే గదా? అట్టి సమయమున్నైన నీపాండవేయు లసమర్థులవలె మిన్నకుండుటయు నాప్రారబ్ధంబు. ఛీ! ఛీ! యిట్టియపౌరుషవచనంబులు నామేన నుండుటకంటె వెడలుటయే శోభాయమానము గాఁగలదు. (అని యేడ్చుచు కృష్ణునకు దనచిక్కువారిన కురులుచూపుచు) అన్నా! నందనందనా! యీనాకురులు దుస్ససేనుని కరాఘాతపీడనంబునం జేసి సగసగంబు తెగిపోయి యున్నయవి. ఇవి యెన్నండు దిరిగి తదీయమేని రుధిరధారావర్షంబునగాని మొలకలెత్తి యభివృద్ధిం గాంచజాలవు. మఱియును.

సీ. ఈవెండ్రుకలు పట్టి ♦ యీడ్చిన యాచేయి
తొలుతగా బోరిలో ♦ దుస్ససేను
తను వింత లింతలు ♦ తునియలై చెదరిరూ
పేఱయున్నఁ గనియెదఁ ♦ గాకగాక
యలుపాలఁ బొనుపడు ♦ నట్టిచిచ్చే యిది
పెనుగద పట్టిన ♦ భీమసేను

బాహుబంబును ♦ బాటించి గాండీవ
మను నొకవిల్లెప్పు ♦ డునువహించు
ఆ.వె. కత్తిపికత్రిమంబుఁ ♦ గాల్పనే యిల్లు బ
న్నములు పడిన ధర్మ ♦ నందనుండు
నేను రాజరాజు ♦ పీనుంగు గన్నార
గానఁబడయు మైతి ♦ మేని కృష్ణ!

ఉ. నెట్టన యట్టియల్క మది ♦ నిల్పితి రక్కసతాల్మిఁ జివ్వొచ్చెడిం
గట్టెపయట్లు పెద్దయును ♦ గాలము దీనికి నాలు కెన్నడుం
బుట్టదు దుష్టనిగ్రహము ♦ పూని జగంబులు గాచునట్టిలో
బుట్టవు నీవు దేజమున ♦ బొల్చిన భర్తలు గల్గ నచ్యుతా!

(2 వ అనుబంధము)

(అని వెక్కి వెక్కి యేడ్చును)

కృష్ణు:—(ద్రౌపది నూరార్చుచు)అమ్మా! విచారింపకుము.

ఉ. ముచ్చిరనేల యేఁ గలుగఁ ♦ ముద్దియ నాకు వృకోదరుండు వి
వ్వచ్చుడు దోడురాగ జన ♦ వద్యుడు ధర్మసుతుండుపంప నే
మెచ్చుగ శత్రుసంక్షయము ♦ మేకొని చేసెదగాక నీశోకం
డచ్చుపడంగ నేర్చునె దు ♦ రాత్ములు కౌరవు లుర్వి యెత్తుగే?

కావున నాపల్కుల నాదరించి యూరడిల్లుము. మేరువు దలక్రిం
దైనను నాచెప్పిన చొప్పు తప్పక కాక మానదు మఱియు.

గీ. పూని పల్కెద వినుము రి ♦ పుక్షయంబు
జేసి యుజ్జ్వలపుణ్యాల ♦ శ్రీసమేతు
లైన పాండుకుమారుల ♦ యధికవిభవ
మీవు నూచెదు తడవు లే ♦ దిదినిజంబు.

జగంబున గలవారలు నన్ను పాండవపక్షపాతిగాక ధర్మపక్షపాతి యనుట శ్రీధర్మజునిపంపున కంగీకరించితినిగాని వేరొండు గాదు. కావున చింతదక్కి సుఖంబుండుము. నేను పోయి వచ్చెదను

(అని నిష్క్రమించును.)

(తెరవ్రాలును)





సంగీత

# శ్రీకృష్ణరాయబారము

## తృతీయాంకము.



### 1 వ రంగము—కౌరవదర్బారు.

(ప్రవేశము గాంధారితో ధృతరాష్ట్రుడు, భీష్మ
ద్రోణ కృపాశ్వత్థామ విదుర, దుర్యోధన, కర్ణ జమదగ్నులు.)

కృష్ణు:—మామా! కురుభూపాలాగ్రణీ! నేను శ్రీకృష్ణుడను; పాండవుల పాలినుండి దౌత్యము నెఱపవచ్చితిని. నీ వెఱుంగనిధర్మంబు లెందు గలవు. సోదరన్యాయమున పాండవకౌరవులు పరమస్నేహంబున ప్రవర్తించుట యుభయవంశములకును శ్రేయోదాయకము. మఱియు,

చ. భరతకులంబు ధర్మమును ♦ బాడియు సత్యము బొత్తు బెంపునుం
గరుణయుఁ గల్గి యుండునన ♦ గా నుతిగన్నది యందు సద్గుణో
త్కరులరు నీవు నీయనుగు ♦ దమ్ముఁడు నీతనయుల్ యశోధురం
ధరశుభశీలురీ సుచరి ♦ తక్రమ మిప్పుడు దప్ప నేటికిన్.

పాండవుల దురదృష్టమునం జేసి పాండుభూవిభుఁడు దివంగతుఁడైనాడు. కావున నీవు వారి కెప్పుడు తండ్రియంతటివాఁడవు. నీయుభయసంతతులవారు నేకారణముననైన సరే పొత్తువాసి కయ్యముసేయ నుంకించి రేని యాయప నీకే యందగిలదు. కావున,

ఉ. కౌరవ పాండవుల్ తెలుఁగు ♦ గ్రక్కొని శాంతతఁ బొందియున్కి మే
లారయ నాకు నీకుఁ గుల ♦ మంతకు నీనృపకోటి కుర్వికిం
బోంతిమైన నిలకును ♦ చుట్టు మహాపద గావునన్ ధరి
త్రీరమణాగ్రగణ్య గను ♦ తించి యవశ్యము బొందొనర్పవే?

కాక మిన్నక యూరకుంటివా యుభయకులంబులవారి కవశ్యము బోరుగాగలదు నట్టిచో

ఉ. అందు వృకోదరార్జునుల ♦ నాహవరంగమునందు మీరు వా
రెందఱో యెన్నుమా యిచట ♦ నీగురుభీష్ములఁ గ్రోణిసేయువా
రెందఱో వారు వీరు నని ♦ నీల్గుటకింత భవద్బలంబులై
యందరు గూడు నొప్పదె జ♦నాధిప శాంతియొనర్పు మెమ్మెయిన్.

ఈరెండుపక్షంబుల నెవ్వరికిని సంకటంబైన నీక దుఃఖప్రాప్తి దముఁగదా? మఱియు

ఉ. విరును వారు పండితులు, ♦ విక్రమవంతులు బాహుగర్వదు
ర్వారులు లోన రిత్త బవ ♦ రంబున నారడిఁ జావఁబోవ నె
ట్లూరకయుండ బోలు గడు ♦ నొప్పెడి మేనులు వాఁడి కైదువుల్
గూరగ నాటినం బుడమి గూలుట కక్కట యోర్వవచ్చునే?

కనుక నీయిరువాయివారిలకుఁ బవరంబుగాని తెఱంగాలోచింపుము. మఱియు

గీ. పాండుపుత్రులు పిండిరి నచ్చిన ♦ ఎత్రిజలు వారి
సరసి వోంచితి సైశవ ♦ మాదిగాఁగ
నడుమ నిష్కారణమదిగ ♦ విడువదగునె?
వార మొందంగ రక్షింపు ♦ గారవమున.

కర్ణు:—వాసుదేవా! దూతకార్యము నెఱపవచ్చిన నీవు నీపని యేదో జూచుకొనక నాత్మజనస్తుతియు పరనిందయుఁ దలపెడెద వేమి?

భీష్ము:—(కోపముతో) రాధేయా! అవినీతివిధేయా! ఈమహాసభారంగమున నిందరు మహాజను లుండ ధర్మోద్ధారకుఁడగు శ్రీకృష్ణుని పల్కులకు నీకంత దుడుకేల రావలయును? అనేకప్రసంగము గావింపక వాయిగట్టి యూరకుండుము.

ద్రోణు:—సూతకుమారా! శ్రీకృష్ణునిమాత్రమాట యటుంచి సి సభారంగమున యప్రస్తుతముగా మాటలాడుట కేమి యధికారము గలదో తొలుత వచింపుము.

కర్ణు.—(సగర్వముగా) ద్రోణాచార్యా! ఆముసలిగ్రొస్సె భీష్మునితోపాటు నీవును తలయూఁచుచుంటివా?

1. కాదు గురుఁ డయి పేరుచ్చి ♦ గురువులందు
చాలకాలమునుండి మీ ♦ మేల్కలుచున్న
రాజరాజు సెయీడవ ♦ రాదు కందు
విరసముల నాడ వీని యోర్వ ♦ నరవె మీకు?

అశ్వ:—సూతీ! నీచకులసంజాతా! అసంబద్ధప్రలాపా! నీవు నొక పరాక్రమవీరునివలెనే సభారంగమున దలయెత్తి మాటాడుచుంటివా! చాలు చాలు! శాంతిల్లుము.

కృపు.—కర్ణా! దుర్యోధనునిచే నంగరాజ్యాభిషేకము గాంచితి నని సంతసింపఁబోకుము.

2. స్వల్పకర్మును చేఁ దెచ్చి ♦ సకలదిశలు
తాఁడు వాడగ్గు యెంతగా ♦ ధర శిరస్సు

యెన్ని పుణ్యనీరములందు ♦ యెన్నిగతులు
ముంచిన నగునె దా గోవు ♦ మూఢబుద్ధి.

కర్ణు:—ఓరీ! కృపాచార్యా! ఏమి నీపరిగల్పనము? నీకంటికి నే నంత పేలదంబుగా గనబడుచుంటినా? యోని కాదు గాను చూతము. నీపరిభాషానము. (అని వి ల్లెక్కుపెట్టి లేచి)

గీ. ఓరీ! కృపుడా! మదీయాస్త్ర ♦ నుద్ధతీవు
కొంచపుం బుద్ధి దెలియంగ ♦ గొలగిగాని
నోరి కొచ్చినట్టుల పేలి ♦ కోరి సాహ
సస్ఫురత్వ ముస్న రణము ♦ సలుపు తెలియు.

(3 వ అనుబంధము)

నార:— (తనలో) ఆహా! నాకు కావలసినంత కలహాసనము మునుమున్ను కౌరవపాండవ సంగ్రామావసరమున లభింపగలదు. ఇప్పట్టున వీరలను శాంతివచనంబులఁ జల్లపరచి భావికలహమహావృక్షమున కుద్భుటబీజము నాటుదును. (ప్రకాశముగా) కర్ణా! ఏకపక్షాభిమానులగు మీరు మీలో యొండల సహ్యాదిణవై రానలము రగుల్చుకొనియెదరు? రానున్న మహాసంగ్రామమున మీ రెల్లరును రారాజునకు సహాయపడి మీ మీ బాహువిక్రమంబుల గనబరుపనచ్చును. కావున ప్రస్తుతము శాంతింపుడు.

దుర్యో:—నారదా! చక్కగా వచించితివి. కురువృద్ధమహాజనులారా! నారదహితోపదేశము లాకర్ణించి శాంతచిత్తులు గండు. (కర్ణుని తో) కర్ణా! అంగరాజా! శాంతింపుము.

ఉ. ఎందుల కీవివాదముల ♦ విమ్మెయి స్పర్ధ వహించిరోల యా
తొందరపాటు, కార్యము వి ♦ ధాన మోకింగి పవిత గనంబులో

ము వారిదని యూరకుంటిని. పితామహుఁడగు భీష్ముఁడును, గురువగు ద్రోణాచార్యుడు పలుమారు చెప్పిచెప్పి ఫలము గానక నాపైన కినిసి నాఁడుకొనిరి అయిన నింకొకమారు నీయెదురుగా చెప్పెదను. (సుయోధనునితో) తండ్రీ! సుయోధనా!

మ. తనయా! నాపలు కాదరించి వినుమా ♦ దర్పంబు పూనంగ రా
దనయంబున్ కుటిలాత్ములం గలసి స ♦ ద్వ్యాపారసాహాయ్యముల్
గుణులౌ పాండవపంచకంబునకు స ♦ ద్బోధంబున న్నిగ్గి నీ
యన చింతింపక వారిపాలు ధరణిన్ ♦ యర్పింపు మిష్టార్థకా.

( 4 వ అనుబంధము )

విదు:—కుమారా! గాంధారేయా! నీ రాధేయుఁ డగ్నికి వాయువుంబోలె వల్లమాలిన బీరంబులు పలుకుచు నిన్ను యుద్ధప్రియోన్ముఖుని గావించుచున్నాఁడు. నీ వాతని నూతిగాగొని పై తెక్కలాడుచున్నావు గాని నేగిఁ దలంపకున్నావు. పాండవులను సామాన్యులుగా దలంపవలదు. వారు దైవసహాయముగల విజయారంభులు. మఱియు వారనంతసైన్యసన్నాహంబున గండుమీరి యున్నారు గాని నీ వనుకొనినట్లు నీరసంబుగాలేరు. వారి బలౌద్ధత్య మెఱింగించెద నాలింపుము.

సీ. శౌర్యోజ్జ్వలుండు పాం ♦ చాల భూనాథుండు
మహితవిక్రముఁడగు ♦ మత్స్యవిభుఁడు
నధిక ధైర్యాన్వితు ♦ లతని తమ్ములు దగ్ర
తేజస్కులైన త ♦ దీయ సుతులు
నన్నదమ్ములు ప్రతా ♦ పోన్నతు లేవురు
కేకయపతు ల ♦ క్షీణబాహు

శక్తియుక్తుఁడు జరా ♦ సంధసూనుఁడు సహ
దేవుండు నాజయ ♦ త్సేనవిభుఁడు

గీ. వినుము శిశుపాలతనయులు ♦ వీరధనులు
ధృష్టకేతుండు వృషభుండు ♦ దీవ్రరణవి
నోదియదుభర్త చేకితా ♦ నుండు దర్ప
ఘనుఁడు శైబ్యనృపాలుండు ♦ గలరు సుమ్ము.

జమ:—దుర్యోధనా! నాపలుకులు విశ్వసించి వంశవర్ధనుఁడవు గమ్ము. శ్రీకృష్ణార్జునులను సామాన్యులుగా దలంపకుము. వారు కేవలము నరనారాయణాంశసంభూతు లింత నిజము. కావున వారలతోడి వైరము నీకు శోభనదాయకము గాదు. తొల్లి నీవలెనే దంభోద్భవుం డను నాతఁ డానరనారాయణులతో దర్పించి యుద్ధతి వాసినసంగతి నీ కింత జెప్పెద నాలింపుము.

సీ. వినుము దంభోద్భవుం ♦ డనురాజు దనకెదు
రెవ్వరు లేరంచు ♦ గ్రొవ్వి నరుఁడు
నారాయణుండను ♦ వారలు గంధమా
దనమనునగమున ♦ దపము సేయ
వారిపై జని యాహ ♦ వమునకు బిలిచిన
నమ్మునీంద్రులు వల ♦ దని యనేక
విధములఁ జెప్పంగ ♦ వెండియుఁ బోకున్న
గుశముష్టినుజ్జ్వల ♦ విశిఖవృష్టి

ఆ. వె. గురిసి నరుఁడు సేన ♦ గూర్చి యాతనిభంగ
పెట్టి పట్టి విడిచె ♦ నట్టి యమ్మ

హాత్ము లిపుడు పార్థ ♦ డన గృష్ణుఁడనగ లీ
లార్థకలితజన్ము ♦ లై రసూవె?

కావున పాండవులతోడి విరోధ ముడిగి మైత్రీభావమున నుండుట మంచిది పిమ్మట నీయిష్టము.

నార:— దుర్యోధనా! పెద్దల కడ్డు సెప్పుట పాడికాదు. అట్లుంటెనిగిదాయని యుద్ధము చేసి నిజపరాక్రమంబు త్రిజగద్వ్యాప్తము గావింపగోరుట క్షత్రియధర్మము గాదనుట గాదు. నీవు ధర్మ మాలోచించి పెద్దలవాక్యములను విమర్శించి కార్యకరణుఁడవు గమ్ము.

గాంధా:— నాయనా! సుయోధనా! పెద్దలు వలదన్నపని కుపక్రమింపక నీవు సుఖంబుండి మాయాత్మల కానందము గలిగించుచుండుము.

మ. తనయా! నీ కిది మంచికాదనిసను ♦ స్వాంతంబున సద్బంధులున్
ఘనులున్ బూజ్యులు నీదుతండ్రియును బ ♦ ల్కన్ వొందు కేచట్టి భా
వనమో యీపను పోవి త్రిప్పిగదా ♦ వాత్సల్యవిస్ఫూర్తి నే
ననుటన్ బట్టయునైన పంతము విసన్ ♦ న్యాయంబు సత్పుత్రకా!

దుర్యో:— మహానుభావులార! మీమాటలు మన్నింపనందుకు క్షమింపుడు.

క. ఘనులార నన్ను విషయే
మనమును పుట్టించె నట్టు ♦ లయ్యెడుగాకే
విన జవిగాని పలుకులకు
బనిగలదే యుడుగుఁ డింక ♦ బహుభాషణముల్.

కావున నాహిత వాలకించి పాండవులతోడి కయ్యమునకు సిద్ధపడక వారి యర్ధరాజ్యము వారి కిచ్చి సన్మార్గసంచారుఁడవు గమ్ము.

దుర్యో:—కృష్ణా! యిటు వినుము. నేను బహుభాషణములు పలుకువాఁడను గాను మఱియు

క. గురుఁడును బితామహుఁడు నీ
నరనాథుఁడు నెల్ల పొర్లిద్దు ♦ ననుదూరుదు రి
ప్పరాను నీవును దామో
దర దూఱదుగాని తగవు ♦ దలుపవు కంటే?

మఱియు మే మాపాండవపత్నిం బరాభవించితిమనియును, వారిని కానలకు బంపితిమనియు నందురుగాని యది నావలన జరిగినది గాదు అది వారి స్వకీయాపరాధమే.

మ. అరయం దప్పొకయింత నావలన లే ♦ దా ధర్మపుత్రుండు జూ
దరివెంటం దమకించి సౌబలునిచే ♦ తన్ భూమి గోల్పోయి ము
ష్కరుఁడై వెండియు నొడ్డగా నతఁడు న ♦ ష్టపౌత్రిష్టమై గెల్చె నే
తెరువైనం దనయిచ్చతోఁ బడియె సం ♦ తేకాక యేబూటయే?

కావున మాయం దేనెపమును జూడవలదు. వేయేల? నామనోనిశ్చయ మెల్లరకుం దెలియం జెప్పెద నాలకింపుఁడు.

ఉ. ఏమును వారుఁ బంచికొని ♦ యేలుట గల్గదు పల్కకుండు మిం
కేమియు వాడిసూదిమొన ♦ ఇంచుక మోపినయంత మాత్రముం
భూమి యొసర్చి పాండునృప ♦ పుత్రులకిత్తునె? యెవ్వరైన సం
గ్రామమునన్ జయంబు గొని ♦ రాజ్యము సేయుట నిశ్చయించితిన్.

కర్ణు:—భళి! భళి! రారాజా! చక్కగా వచించితివి.

కృష్ణు:—దుర్యోధనా! నీపలుకులు సత్యేతరములై యొప్పుచు
న్నవి. యే మందువా?

సీ. అరయంగ దప్పు లే ◆ దంటి నీవలన గీ
డొకనాఁడు నేసియు ◆ నొక్కనాఁడు
సేయనె నిజనిం ◆ చినయది యాదిగా
నుడుగక పాండవే ◆ యులకు జాల
నగ్గ నేసితి విష ◆ మిడి పెనుగాముల
గిరపించి నీటిలో ◆ గట్టి త్రోచి
లక్కయిల్ గాలిచి ◆ పెక్కుభంగులఁ జంప
దలచిన పావక ◆ ధర్మరక్షఁ

ఆ. వె. జేసి నగిడి రాచ ◆ సిరి నొందియున్నఁ బా
పోప కవ్వు లీవ ◆ పాపబుద్ధిఁ
గనమి జూద మొకటి ◆ కల్పించి కపటంబుఁ
జేయఁ దానన్నెల్ల ◆ చేటు పెట్టె.

కన్నతిప్పలు లక్షోపలక్షలు నీయందుంచుకొని నేను సద్బోధించిన నెవరు సరియందురు? కావున దూర మాలోచించుకొని మరి కార్యాతురుడవు గమ్ము. తలకు మీరిన పిమ్మట విచారించిన లాభము లేదు.

దుర్యో:—ఓ! యింత రేకమై యెక్కరినే బాగదుచుండ నా కోటమానధను డిం దుండ రాదు. (కర్ణునితో) కర్ణా! రమ్ము పోవుదము.

5 వ అనుబంధము

(కర్ణ దుర్యోధనులు నిష్క్రమింతురు.)

కృష్ణు:—ఔరా! యూతని కింతదురభిమాన ముస్నదిగదా!

యింక యెందులకు పనికివచ్చును? ఈకృష్ణుఁడు రహస్యముగఁ బెక్కుభంగుల నయభయంబుల జెప్పినను విన డయ్యెను గదా!

గీ. మంచి పన్నీరు గొనివచ్చి • కొంచెమైనఁ
బూడిదను వైచుగతి యయ్యె • పుడమి చేత
కృష్ణునిహితోపదేశంబు • కెరలి కొంత
వేశ్వరునిముందు వేమందు • నేదివిధము?

ధృత:—తాతా! భాగీరథీతనయా! నే నేమి చేతును? చెప్పవలసినంత చెప్పితినిగదా! నాతప్పేమి గలదు. అక్కాలనాఁడు శిక్షగాని యిక్కాలనాఁడు బిడ్డలా!

గీ. పక్షికందువు రెక్కలు • వచ్చువఱకు
తల్లిచాటున బడియుండు • తరలిపోవు
పిదప దనయంత నెగిరెడు • వేళలందు
అట్టిధర్మంబె దోచె నా • పట్టియందు.

ద్రోణా:—విననివానికి జెప్పిన నేమి ప్రయోజనము? పెద్దవారు చెప్పుచుండిరనియైన యాలోచింపక సభ విడిచి వెడలిపోయెనుగదా!

గీ. సుంత యోచింప డేలకో • స్వాంతమందు
పెద్ద లందఱుఁ బలికినవి • ప్రియమటంచు
తెలియనేరడు బాగోగు • తెలివి లేమి
యిట్టు లితడు జక్కంబడు • చెట్ట వదలి.

సాత్యకి:—(ఆత్రముతో ప్రవేశించి కృష్ణునితో రహస్యముగా) అన్నా! యింకేమున్న దాపాపాత్ముఁడు దుర్యోధనుఁడు కర్ణదుశ్శాసన శకునులతో నేమియో యాలోచించి బహుళసైన్యసంయుక్తుఁడై నిన్ను బంధింప వచ్చుచున్నాడు. జాగ్రత్త! జాగ్రత్త!

కృష్ణః:—(దుర్యోధను నుద్దేశించి ప్రకాశముగా) ఓదుర్యోధనా! నీవు నీపాడునైజమును బోనాడితివిగావు రాజధర్మము మఱచి దూతనై వచ్చిన నన్ను బంధింప దలచితివిగాని నాసామర్థ్య మించుకయైన దలంపవైతివి. నీవు గాదుగదా! బ్రహ్మాదిదేవతలునైతము నన్ను బట్టజాలరు. సమస్తజగజ్జాలములకు సృష్టిస్థితిలయకారణసంభూతుండగను, ఆదిమధ్యాంతరహితుండను, పిపీలికాదిబ్రహ్మపర్యంత సృష్టిసమన్విత మహాభూతధాత్రి యంతయు నాకుక్షిని బ్రతికింపంగ నేయపాయంబును గాని లేక నిరపాయంబుగా వెలయుచుండును. అట్టి నన్నా నీవు బంధింప దలంచుట? యెంతనగుబాటు? నీచులంగూడి మైత్రిం జేసి నీబుద్ధినైచ్యము పరభూతమైనది. ఇనుముతోగూడి యగ్నియు సమ్మెటపెట్లు దిన్నచందంబున నీచుల మాయావాగురలలోబడి చెడిపోవుచున్నావు. ఈకర్ణశకుని దుశ్శాసనులు తమదుర్బోధల నిన్ను చెడదీయుచున్నారుగాని నిన్ను సంపన్నుని గావింప జాలరు. నేనిదే విశ్వరూపము జూపుచున్నాను. ఏదీ పట్టుకొనుము నీకెల్వినేటలు! నీవారిసామర్థ్యమును తెల్లమగును. (అని విశ్వరూపము దాల్చును)

(అప్పుడు దుర్యోధనాదులు నిశ్చేతనులై యుందురు. భీష్మాదు లీక్రింది దండకము కలిసి చదువుదురు)

—: దండకము :—

శ్రీమన్మహాదేవదేవా! పరేశా! జగద్వ్యాపకా! లోకరక్షామణీ! ఆర్తచూడామణీ! భక్తకారుణ్య నీరాకరా! దీనబంధూ! రమానాయకా! ఆదిమధ్యాంతశూన్యా! నమోచక్రహస్తా! భవద్దివ్య శ్రీవిశ్వరూపంబు మాపూర్వపుణ్యంబులం జేసి కన్నార జెన్నార వీక్షింపగా నయ్యె మాపాపముల్ వాసె, మాజన్మముల్ దీరె, మే మెంతయున్ ధన్యతం గాంచి

మోయయ్య గోపాలబాలా! యశోదాకుమారా! నమస్తే! నమస్తే! నమః॥

ధృత:—శ్రీకృష్ణపరమాత్మా! నే నిప్పుడు నాయంధత్వదోషము వలన ఫలంబు నిజంబుగా నొందితిని. ఏల నందువా? మునులకైతము యోగదృష్టులం గాంచలేని నీవిశ్వరూపసందర్శనభాగ్యము నాకు లభింపదయ్యె. ఏమహానుభావుని దివ్యపాదనీరేజములు నీరేజాసనముఖ్యదేవతానికములకు ప్రీతిదినపూజాతీర్థములయ్యెనో ఏదేవదేవుని లీలావిశేషమాత్రమున నీవిశ్వమెల్ల సృష్టిస్థితిలయముల నివ్వటిల్లుచున్నదో, ఏపరంధాముని కిరుణావేశము మోక్షపథగాములకు దారిబత్తి మయ్యెనో అట్టి నీసుందరమంగళ విగ్రహము గాంచగలుగు భాగ్యము లేకపోయె. కావున ఓనందనందనా! భవదీయ భక్తవత్సలత్వంబు మెఱయ నాకు దివ్యదృష్టింబ్రసాదించి నీవిశ్వరూప సందర్శనలాభము సేకూర్పుము.

కృష్ణు:—వృద్ధరాజా! నీకోర్కె ఫలించునుగాక! నీవుధన్యుడవు గాబట్టియే మగీయకృపాపాత్రుడవు గాగలిగినావు నీకిదే దివ్యదృష్టింబ్రసాదించుచున్నాను. చూడుము. నావిశ్వరూపము పాపాఘములనుండి దూరముగమ్ము. (అని ధృతరాష్ట్రునకు దివ్యదృష్టి యొసంగును.)

(అంత ధృతరాష్ట్రుడు కన్నులువిప్పి చూచియు గాంధారి కనుల గంత విప్పుకొనియు శ్రీకృష్ణుని విశ్వరూపము దర్శించి స్తుతింతురు )

## —♦ దండకము ♦—

శ్రీమన్మహావీర! లోకేశ్వరా! ఆదిమధ్యాంతశూన్యా! మహాతేజ! భక్తావనీశా! రమాసుందరీ! వక్షితారూఢవక్షా! దయాసాగరా!

భక్తసంరక్షణాదీక్ష! నీరేజపత్రాక్ష! బ్రహ్మాదిబృందారకాసీకసంపూజితాంభోజపాదా! పరేశా! పరంధామ! నీశక్తి వర్ణింప మెంతవారంబు మాపాపముల్ వాపవే పుణ్యలోకంబు ప్రాపింపు మోయయ్య! లోకేశ్వరా! లోకసంత్రాణ! మాయాప్రమేయా! నమస్తే! నమస్తే! నమస్తే! నమః॥

(6 వ అనుబంధము.)

ధృత:—శ్రీకృష్ణా! నీవిశ్వరూపము సందర్శించిన కనులతో నాకింక నితరప్రపంచమును జూచుటకు మనస్సంగీకరింప కున్నది. కావున నాదృష్టి నుపసంహరింపుము. (అని ప్రార్థించును.)

కృష్ణుః—(ధృతరాష్ట్రునిదృష్టి నుపసంహరించి ప్రకాశముగా) మామా! ధృతరాష్ట్రా! నీమనోభీష్టము నెరవేరినదిగదా! ఇక బోయి వత్తును శలవా?

ధృత:—చిత్తము శ్రీకృష్ణపరమాత్మా! ధన్యుడను! ధన్యుడను (నమస్కరించును.)

గాంధా:—(తిరిగి తనకండ్లకు గంతలు కట్టుకొనును.)

కృష్ణు:—మంచిది. నే నిదే పోవుచున్నాను. (అని లేవగా అందఱును లేతురు.)

(తెర వ్రాలును.)



## 2 వ రంగము.

### ఇంద్రప్రస్థపుర బాహ్యప్రదేశము.

(పాడుచు నారదుడు ప్రవేశము)

నార:—(తనలో) ఆహా! నేను జన్మమెత్తిన దాదిగా నిప్పటి వరకు నెన్నండుగాని యిట్టికలహాశనము లభింపలేదు. తృప్తి దీరిన నిట్టి కయ్యములు గలుగవలెగాని చిల్లరకయ్యములు నాకావులింతలపాటివే యగును. శ్రీకృష్ణుడు రాయబారియై వచ్చినాడన్నంతనే నామాయల మారి వెన్నుదేలి యేపన్నాగములు పన్ని కౌరవపాండవుల నడుమ సంధి పొసగించి నాకడుపు గొట్టునేమోయని కొందలపడితినిగాని నాకట్టిమనో వ్యథ గలుగకుండ కర్ణశకునిదుశ్శాసనులు దుర్యోధన దురభిమానాగ్నిని రగుల్కొల్పి కార్యము చెడదీసి నా కెంతయుజేతోముద మనుగ్రహించిరి. తప్పనిస నాకెంతయు వారు మహోపకారులని యొప్పుకొనక తప్పదు. పాప మీసుయోధనుడు వారిమాటలు నమ్మి దాను ధర్మతత్పరులును సత్యవాక్యనిరతులును దుర్జయవిక్రమాటోప విరాజితులునగు పాండ వేయులతో గయ్యమునకు సిద్ధమునాడు. ఔరా! వీని వైఖరి తగదు కొం పతో డీకొన సాహసించినట్లున్నది. ఈసంధి యిట్లు విసంధి యగుటంజేసి యిరుపక్షములవారికి నాహవంబు సిద్ధంబు. నాకు గావలసినంత కలహా శనంబు సమృద్ధంబు.

వ. సరసిశరాసనకిం బుడిపు ♦ నారదపుత్రుడుగాక బోదుపే
రురమును జీల్చి వాయుజుడు ♦ నొంపకపోవడు దుస్ససేను దా
మఱయు సుయోధనుం దొడలు ♦ మానుగగొట్టి వధింపకుండ దీ
యిరువుర గ్రాస్యముల్ సహగు ♦ నింతయొ నంతయొ నాకు దృష్టిగన్.

(ముందునకు రెండడుగులు వైచి) నే నిప్పుడు తిన్నగా ధర్మజుని యాస్థానమున కేగి యక్కడి పరిస్థితులు గొంత విచారించి సమయాను కూలముగ వారినాలమునకు సంసిద్ధపఱచి యీకలహావృక్షమునకు దోహదము గావించి దిగంతవ్యాప్త శాఖోపశాఖాటవిని గావించెదనుగాక!

(నిష్క్రమించును.)

(నారదుఁడు నిష్క్రమించును.) ( ...రలు ...లును.)

(ఇది విష్కంభము)

మఱియు.

గీ. ధర్మజాదులీ గూడ వృ ♦ త్తాంతమెఱుఁగ
రేఁగియుండిరా యీపాటు ♦ లింత గోఁగ!
నీకు వారు విసముగ్రులై ♦ నిర్మల మతి
పాదసేవ నిన్నభిషిక్తుఁ ♦ బునుపకుందురె?

కావున గుణాగ్రణ్యుండవగు నీవు నామాటలు పాటిగావని యెంచి పుచ్చక నావెంట పాండవులపాలికి రమ్ము. వారికి నిన్నెఱింగించి నిన్ను విశాలసర్వంసహా సామ్రాజ్యమున కభిషిక్తుని గావించెద. నీవు వచ్చుటయే తడవుగాన యుధిష్ఠిరుండు మహోత్సాతిరేకమున యువరాజై నీ పార్శ్వంబున నధివసించి నీకు చామరంబులువీచు; పవననందనుఁడు సితాతపత్రంబువట్టు; శక్రనందనుఁడు సారథ్యముగావించు; నకులసహదేవులు నీయిచ్చయెఱిఁగి పరిచరించుచుందురు. మఱియు, పాంచాలయాదవపాండ్యమాత్స్యులు లోనుగాగల సకలరాజలోకమును నభిమన్యుప్రముఖితకుమారవర్గంబును గొలువ నేమొప్పంబలసి పరివేష్టించియుండు నిట్టి మహేంద్రవిభవంబున మహనీయుండవగుచు నిమ్మహీమండలం బవక్రవిక్రమంబునఁ బాలించుము. మఱియు;

క. పాంచాలరాకుమారిక
యంచితగతినర్గించు ♦ నాగివసనిగా
సంచితపుణ్యా! నీకో
క్కించుక యేని యనుమాన ♦ మేలా? గమ్మా!

నాపల్కులందు విశ్వాసముంచితివేని నీజనని కుంతియు, తండ్రియగు జగద్బాంధవుఁడును మహానందమొందగలరు. నీవీ కుమంత్రుఁగు కౌరవేయులగూడి జగంబున మాయని యపకీర్తి నొందనేల! నీకు శ్రేమకర

మగు విధమాలోచించుకొనుము. పోనిమ్ము. నమ్మినమిత్రుల నెట్లువదలి వత్తునందువా? వచ్చినందువలన నీకే ధర్మహానియును రానేరదు. "శరీరమాద్యం ఖలుధర్మసాధనమ్మ" నిగదా పెద్దలందురు. ధర్మార్థకామమోక్షంబులను చతుర్విధ పురుషార్థములును బాధించుటకు దేహముగదా కారణభూతము. కావున నట్టి జీవరక్షణ మాలోచించుకొనుము.

కర్ణు:—శ్రీకృష్ణా! నీవాక్యములు నాకు నవ్వును, జాత్యాభిమానమును, కార్యదీక్షయందుఁ జలమును, విస్మయంబును గల్గించుచున్నవి. యేలనందువా? వినుము.

గీ. ఎఱుగుదీ వెల్లవృత్తాంత • మేను మున్న
నిన్ను బోలుపెద్దలు సెప్ప • విన్నకతన
నిఖిల సద్ధర్మ వేదివి • నీవు గూడ
ప్రాకృతు లనెడు భంగినిఁ • బలుక నగునె?

అదియుఁగాక,

గీ. కుంతిదేవి పరిచారకుఁ • గొల్చి నన్ను
గనియు పుత్రమోహంబోడి • కడలి విడువ
సూతుఁ డాతఁడు నన్నుఁదెచ్చి • సుదతి కివ్వ
నంత నామెచన్నులు చేప • నన్ను బెంచె.

మఱియు వారు నామాత్రపురుషాదులు దమశరీరంబున నింక పుత్రునిఁగా భావించి గారవంబునఁ బెంచ నేనింత కాలమువారియాధీనంబుననుండి యిప్పుడు పాండవేయుల జేరినచో లోకులు నన్నేమని దూషింతురో యెఱుంగుదువా?

గీ. ఛీ! యితండు సామ్రాజ్య ల • క్ష్మిని దలంచి
తగుదు నమ్మాయటంచు పాం • డవులఁజేరె

మఱియు నర్జునుతో వైర ♦ మెట్టిసి యతని
కీడుగా లేక వచ్చెగా ♦ యితఁడటండుర్.

అంతియగాక,

ఉ. కూడమదినంగి బొల్పడిన ♦ గోలె సుయోధను నప్పుడుల్నమో
మోడకటించు నిప్పుడు మ ♦ హోజ్వలవైభవ విభ్రమంబునే
కూడునటంచు బాండవుల ♦ గూడుటయే గతి ధర్మమయ్యె? నే
నాడితినంచు గాదిది జ ♦ నార్ధన ధర్మము? యెంచు మానసంబో.

అంతియగాక నీవింతకు క్షణకాలముముందే గదా నన్ను వృద్ధోప
వనంబును, ధర్మసంవేదనంబునుం గలవాడవని యంటివి! రాధయు నతి
రథుండును నాకు జాతక కర్మాది సమస్తసంస్కారంబులు నిజకులోచితం
బుగా నాచరించినట్టి జననీజనకులకు పుత్రకృత్యంబులు గావింపక వారల
విడిచి నేనీపాండవుల గలయుట యేపాటిధర్మము? నావంకగల బంధుమి
త్రాప్తవర్గముగ విడిచి రమ్మని చెప్పుట నీ కేపాటి న్యాయము?

మఱియు,

ఉ. సూతసుతుండు వీడనక ♦ సూనుల తమ్ములకంటె నాకు సం
ప్రీతి యొనర్చి తేజమును ♦ పెంపును నాటికి నాటికగ్గలం
బై తనరార నన్ను దన ♦ యంతటి మానిసి జేసియుండు నే
నేతగవ్రాది యాతురుకు ♦ లేశ్వరు వాయుదు ముట్టవచ్చినన్.

కావున నీధర్మోపదేశముల వంకకు నాచెవులు వినబారుట లేదు.
మఱియు నాధర్మసుతుడు నేనతని యగ్రజుండనని యెఱింగెనేని దాను
ధరాపాలనంబు గావింపడు. అట్టి ధర్మమూర్తియే యీధరావలయం
బెల్ల పాలింపదగినవాడు. కావున నన్నిం కాపనికి ప్రోత్సహింపకుము.
మఱొక్క సంగతిగూడ జెప్పెద నాలింపుము.

తే. గీ. శమన సూను డేగతినైన ♦ సమరమందు
ఘోరవిశిఖాగ్ని కీలల ♦ గుఱియజేసి
మమ్ము బోటుల తప్పక ♦ మడియజేయు
నిల యతండేల నర్జుడు ♦ జలజనేత్ర!
కావున క్షమించి నాయెడ నాపరిసక్తి యింక విడనాడుము.

కృష్ణు:—(తనలో) ఆహా! యేమి వీని మనోధృఢత్వము? చతు స్సముద్రముద్రిత ధరావలయం బఖిలంబు లభింపనున్నను మనసునకు గ్రక్కున రెండజాలకున్నాడు. (ప్రకాశముగా) రాధేయా! నేను చెప్పవలసిన యర్థమంతయును దెలియజెప్పితిని గాని నీవు నీపట్టుదల వదలజాల కున్నావు. నే నేమిచేయుదును? నీవింక బోవచ్చును. పోయి సుయోధన కురుభీష్మాదులకును మీకు దోడుగావచ్చిన సకల రాజలోకమునకు నీమాసము సౌమ్యమాసమై శీతోష్ణంబులు లేక ఫలోపేతమును,సమగ్ర ధాన్యంబును సులభ యవస మాధవంబును నగుచు నొప్పియున్నది. నేటి కేడవదవ దివసంబున నమావాస్య వచ్చును. నాడుపుణ్యాదినం బగుట భండనము ఖండితముగా గావలయునని యెఱింగింపుము. పోయి రమ్ము.

కర్ణు:—మంచిది. నాకింక శెలవొసంగుము పోయి వచ్చెదను.

కృష్ణు:—సరే! నీవింక పోవచ్చును నే నిదే పాండవపాలికి జని వారలను కూడ యుద్ధసన్నద్ధులు గావలసినది చెప్పెదను

(అని యిరువురు నిష్క్రమింతురు)

(తెరవ్రాలును.)



2 వ రంగము — కుంతీమందిరము.

(ప్రవేశము — కుంతి ఒంటరిగా విచారించుచుండును.)

కుంతి:—(తనలో) అక్కటకటా! యేమి ఈకాల వైపరీత్యము!

మ. తమవారిన్ సిరి వధించుటిది స • ద్ధర్మంబటే యక్లేశకృ
త్యమొకో తాంగయ్యము ద్రోణభీష్మకృప • వ్యాటోపముల్ మాన్పుట
ల్పములం గీరునె యందునర్కజుని యా • గ్రంబెప్పుడుం గ్రోధదా
వము భీమాదులమీదఁ దిక్కొరులకు • త్సాహంబులేదా కటా

(8 వ అనుబంధము.)

(అంతి విదురుఁడు ప్రవేశించును.)

విదు:—అమ్మా! కుంతీ భోజనందనీ!

ఉ. అక్కట కౌరవాన్వయ మ • హార్ణవమింకెడున ట్లుపుట్టె నీ
చక్కరుఁడైనట్టి గేశవు హి • తోక్తికి మేకొనడయ్యె నగ్రజుం
డెక్కటిదాన చాలుఁ దము • నిందఱుదీపశరాగ్ని గాల్పఁ గా
వక్కనపాండునందనుల • యేడ్తెఱఁదొల్లియు దారెరుంగరే

కిట్టా! మన పాండవులిదుర్మార్గుల మూలమెన్ని చిక్కుల నంది
యుంది వితాకువడిక తొలుత సంజయునిచేతను ఎదప కృష్ణపరమాత్ముని
చేతను రాయబారము పంపియు విధిలేక యుద్ధమునకు పూనవలసినవా
రైరిగదా! ఆహా! విధియెంతె వచ్చెది. ఏమిచేయుదము.

కుంతి:—పూజ్యా! విదురా! ఎంతచేసిన నేమి? మూర్ఖులగు కౌర
వుల మనోప్రవృత్తులు మారలేదుగదా? నీవు వింటివో లేదో గాని మన

కృష్ణుడు రహస్యముగా రాధేయుని దోడుకొనిపోయి యాతని జన్మ పత్రికార మెఱిగించి పాండవులజేరిన సమస్త సామ్రాజ్యాభిషిక్తుని గావించె దనని యన్నను నాతఁడు వానిమాటలు పెడచెవిని బెట్టి యందులకంగీక రింపలేదట! యోచితివా వాని మనోనిశ్చయము!

విదు:—అవును శ్రీకృష్ణుఁడింతకు మున్నే ప్రయాణమై పోవుచు కర్ణునితో నిట్టి ప్రస్తావన గావింతునని చెప్పియేపోయినాఁడు పర్యవసానము తెలియక తల్లడపడుచు నీదగ్గఱకు వచ్చిన దెలియుఁగనియే యిప్పుడిచ్చటి కి వచ్చితిని. అట్లనా? అగును! వాఁడట్టివాఁడే! అందులకు సందేహము లేదు (ఇంచుక తాళి) పోనీ నీవుకూడ జెప్పి చూడరాదా మఱి యాతఁడు వినునేమో?

కుంతి:—అగును. నేను నట్లనియే తలంచి యెట్లాతని పడిపాటు చే సిన యని యాలోచించుచుంటిని.

విదు:—అతఁడిప్పుడు సంధ్యాద్యనుష్ఠానార్థము యమున కరిగి నాఁడు. నీ విప్పుడే పోయితివేని యాతనియొంటిపాటు నీకు లభింపగలదు. తప్పక అట్లుగావింపుము. నేనింక బోవలయును. ధృతరాష్ట్రుఁడేలనో నన్ను రమ్మని కబురంపినాఁడు. నే నీవిషయము విన్నడగి తెలిసికొనుటకే వచ్చి తిని. పోయి వచ్చెదను. (అని నిష్క్రమించెను.)

కుంతి:—నేనిప్పుడు యమున కరిగి నాతనయుఁడగు కర్ణునితో సంభాషించెదను గాక!

(అని ముందునకు నరిగి క్రమముగా తెరలేచును. అంత కర్ణుఁడొక రుండును.)

కర్ణు:—(తలెదవిసిఁ జూచి) అమ్మా! పాండుభూపాల పట్ట మహిషీ! రాధానందనుఁడిదే నమస్కరించుచున్నాఁడు.

(అని నమస్కరించును.)

3 వ రంగము — ఆకాశవీధి.

(వీణాగానము చేయుచు నారదుడు ప్రవేశించును.)

10 వ అనుబంధము.

నార:— (తనలో) నామనోరధము చక్కగా పరిపూర్ణత్వము జెందనున్నది. మహావీరుడును, వితరణాధికృత బలిదధీచిజీమూతవాహనుండునగు కర్ణుని బాండవేయుల వంకకు దిప్పదలచి శ్రీకృష్ణుడును గుంతియు నెంతయో విశ్వప్రయత్నములుజేసి వానిపూర్వజన్మ ప్రకారంబు సవిస్తరముగా దెలిపి, ఆశగొల్పి వశీకృతునిగావింప లేరైరి. ఆహా! యేమి వానిమిత్రహిత కార్యాచరణశీలము వర్ణనాతీతమైనది.

తే. గీ. ఔర! యేమి? వీని ధృష్టంబు ♦ అభినుతింప
అల్ల వేయిఫణంబుల ♦ నలరునట్టి
ఘనుడు శేషాహియైన యా ♦ భినుతియింప
జాలునేమి? ధరణియందు ♦ సన్నుతింప.

ఈసమరంబున ధర్మపరాయణులగు పాండవేయులకు నావలననగు నొకింతసాయము జేయబుద్ధి యగుచున్నది. (ఆలోచించి) అగును. అట్లుగావించెద. కర్ణునకుగల కవచకుండలంబులు వానిమేన నున్నవరకెవ్వరేమియును జేయజాలరని జగద్బాంధవుడగు సూర్యభగవానుడు తొల్లి వాని జననసమయమందె వాకొచ్చియున్నాడుగదా? కావున నేనెట్లైన వీనికడనుండి యాకవచకుండలంబులు వేరుసేయువలయును. (నిదానించి) అగును. ఈతడు మహాదాత. అర్థులడిగిన యర్థంబు విడక వ్యర్థపుచ్చి పంపజాలడు. కావున నర్జునుని జన్మదాతయగు మహేంద్రునాతని పాలికి బ్రాహ్మణవేషమున బంపి కృతసత్కారుడౌనపిమ్మట నా

కవచకుండలంబులను యాచింప బ్రోత్సహించి సుతుని కుపకారము జేయింతునుగాక! ఆహా! నాయూహ యెంతచక్కగా యున్నది. కావుననే బ్రహ్మాదిదేవతలు సైతము నన్ను జూచిన భయపడుచుందురు. సరియే! నేనింక నిలువదగదు. తిన్నగా స్వర్గలోకమున కరిగెదను. సఫలీకృత మనోరధుడనయ్యెదను.

(నిష్క్రమించును.)

(తెర వ్రాలును)





సంగీత

# శ్రీకృష్ణరాయబారము

పంచమాకము.



1వ రంగము—కర్ణుని మందిరప్రాంగణము.

(కర్ణుడు నిజమందిర ప్రాంగణమున పచారులుచేయుచు ప్రవేశించును)

కర్ణు:—(తనలో) ఆహా! నాకింతకాలమునకుగదా భుజముల తీటదీర్చుకొనజాలు మహాసంగ్రామము సిద్ధించినది. రారాజు నన్ను చిర కాలమాది బోదిజేసిన మైత్రిపెంపున కుగల పరమానురాగ ప్రవర్ధితమిత్రప్రత్యుపకృతి గావించి మిత్రహితైక కర్మాచరణుడ నయ్యెదను గాక! అహో! ఆసుయోధనుడు నాపు గావించిన మహోపకృతి యేమని గొనియాడదగును.

తే. గీ. స్వవిహితాప్త సంవర్గంబు ♦ సరకుగొనక
తండ్రి, భీష్మాదివృద్ధుల ♦ తలపుగొనక
నన్ను సూతుడ్రటంచైన ♦ నెన్నకుండ
చెలగి నన్నర్ధరాజ్యాభి ♦ షిక్తుజేసె.

కావున నాతనికి సమయమువచ్చినది గనుక మద్భుజాబల మేర్పడ వైరిలోకమును పెల్లార్చి కృతార్థుడనయ్యెదనుగాక!

(అంత మాయాబ్రాహ్మణరూపధారియై మహేంద్రుడు ప్రవేశించును.)

మహేం:—దానకర్ణా! నీకు సర్వదా శుభమగుగాక!

గీ. స్వస్తి! నీకోయి! రాధేయ! ♦ శస్త్రచరిత!
స్వస్తి! నీభుజాశక్తికి ♦ సరసగణ్య!
నీదు దానమహిమము వ ♦ ర్ణింపఁదరమె
అల ఫణీంద్రునకైన నీ ♦ యవనియందు.

కర్ణు:—భూసురగ్రామణీ! వందనములు. విచ్చేసి యీస్వర్ణపీఠ మలంకరింపుడు. (అని స్వర్ణపీఠము చూపించును.)

మహేం:—(ఆసీనుఁడై) అనుపమాన వితరణఖనీ! నీదాతృత్వము ముల్లోకముల దిగంతములవఱకును వ్యాపించి యుండుటవలన నిన్ను గొండొక యర్థ మడుగదలచివచ్చితిని

కర్ణు:—మహాప్రసాదము! ధన్యుఁడను మహాత్మా! తమ నిలయ మేది? భవదీయ నామచరిత్రంబు లెట్లలగింతురా?

మహేం:—సందియ మేమి? అవశ్యమట్ల యెరింగించెద నవధరింపుము.

గీ. స్వీయనామంబుఁ జెప్పుట ♦ లేదదూష్య
మగుటఁ దానిఁ జెప్పగనోప ♦ మిగతవృత్త
మెఱుఁగుమేదినీపాలుఁడ ♦ నిద్ధధర్మ
సంగతుల కనయుంబేను ♦ సంగతుండ.

కావున నాకొక్కచో నిలయమని యుండదు. నాయాచితవ్యము సమకూర్పదలంపు గలిగెనేని నాయర్థము విన్నవించెదగాక!

కర్ణు:—సందేహ మేమి? ఈకర్ణుఁడు యాచకవర్గముపట్ల లాకేత్వము దానకొమ్ముగ్రను (లేదు) విరోధులపట్ల ఁాకిత్వమును తాకు

విసర్గములు (జతః) నుచ్చరించువాడనని తలంపబోకుడు. మరియును—

గీ అర్థిశబ్దంబు చెవిసోకి ♦ నంతమాత్ర
మాత్మయుప్పొంగి పోవునో ♦ యువనినురుడు!
వినుము కామితార్థంబులే? ♦ యొనరుమీార
బ్రాణమైనచో నిత్తుని ♦ ర్వ్యాజ్యకరుణ

మహేం:—అట్లైన నడుగుదునా?

కర్ణుడు:—వేగమేయడుగుడు.

మహే.:—సంకోచింతువేమో?

కర్ణు:—యాతికు సంకోచముండిన వాడుత్తమశ్రేణి కర్హుడగునా?

మహేం:—సంతోషము. అట్లైన నీ......(సందేహించును)

కర్ణు:—సందేహమేల బొందెదవు. నిర్విశంకముగా గోరుము. ఇచ్చెదని యివ్వకుండుట నమతముగాదు.

మహేం:—అట్లైన నీకవచకుండలములు నాకొసంగుము?

కర్ణు:—(చిరునవ్వునవ్వి) త్రైలోక్యపాలా! నమస్కారము. నీవు మహేంద్రుడ వీసంగతిమున్న మాజనకుడగు సూర్యభగవానుడు చెప్ప గావిని యున్నాను. నాకీకుండలములు రణరంగవిజయైక దాయకంబులై నను మహేంద్రుడవైన నీయంతటివాడు నాబోటి మానవుని దేహి యని యాచించుటవల్ల మహానందంబున నొసంగదలచి యున్నాను కాని నీకడనున్న మహాశక్తియనునస్త్రము నాకు బ్రసాదించి వీనిని గైకొను ము (అని కుండలము లుదీసి మహేంద్రున కొసంగును)

మహే:—(కుండలములు స్వీకరించుకొని) సూర్యతనూభవా! నీయసదృశ వితరణమున కానందించితిని. ఈకవచకుండలము నాకొఱకు గావు ధర్మప్రవర్తనులగు పాండవుల విజేయులను గావించుటకు. మఱియు

విశేషించి నానందనుడగు విజయునకు కీడు శంకించి యిట్లుగావించితి. నీవు కోరిన మహాశక్తియను దివ్యాస్త్రమిదే ప్రయోగోపసంహారములతో దెల్పెదను. (అని కర్ణుని చెవులో నేమోచెప్పి ప్రకాశముగా) కర్ణా! నీవీయస్త్రమును మాత్రమల్పులమీద ప్రయోగింపకుము. ప్రయోగించితివా యిదితిరిగి నీకే కీడువాటిల్ల జేయగలదు. జాగ్రత్త!

గీ. కర్ణుడా! నీదృఢత్వంబుఁ ♦ గాంచియేను
సంతసంబున జెప్పెడి ♦ దంత వినుము
అస్త్రమిది ఘోరమైనది ♦ యల్పులపయి
వేయబోకు నామాటలు ♦ విశ్వసించి.

నేనింక బోయివచ్చెదను.

కర్ణు:—చిత్తము. మహాప్రసాదము.

మహేం:—(నిష్క్రమించును.)

(తెర వ్రాలును.)

---

౨ వ రంగము — దుర్యోధనుని రహస్యమందిరము.

(దుర్యోధనుఁడు, కర్ణుఁడు ప్రవేశింతురు.)

దుర్యో:—అంగరాజా! విశేషించి నీబలగర్వముచేతనే నేనీమహాసంగరము పాండవులతోడ దెచ్చుకొంటిని. నన్ను నీటముంచినను బాల ముంచినను భారము నీయదే.

కర్ణు:—రారాజా! ఎంతమాటంటివి! నే నెన్నటికిని నీకను కూలుఁడనుగాక వేఱొం డెట్లగుదును? నాయీదేహము, గేహముమొదలుగాగల దంతయును నీయదిగాదా? మఱొక్కటి—

గీ. పాండుసుతులపై నీకెగా ♦ వైరముంట
ద్రౌపదీస్వయంవర మాది ♦ రాజరాజ!
నాకుగూడను గలదెంతొ ♦ సాకుగాదు
నాటి నాపరాభవ మీావు ♦ నరయవొక్కొ.

కావున నీ కేసంశయమును వలదు. నాదేహంబున ప్రాణములున్నంత వఱకు నీకై బోరెద. ఇందుల కావంతయును సందేహ మవసరములేదు.

గీ. కుతిలమందిను డవరాశిఁ ♦ గ్రుంకుగాక!
ఝల్లుమంచుడు గణమెల్ల ♦ ఢుల్లుగాక!
నీరనిధు లేడునుంగూడ ♦ నింకుగాక!
ధరణినాధ! నాప్రతినంబు ♦ తప్పదెపుడు.

దుర్యో:— అంగసార్వభౌమా! యెందులకంత ఘోరప్రతిన బూనెదవు. నీయెడల నాకెన్నఁడైన సందేహము గలదా?

కర్ణు:—లేదు కాని నీకు ధైర్యము కలిగించుటకు పూనవలసి వచ్చినది. దానికేమిగాని యుద్ధమునకు సర్వసన్నాహములు సమకూరినవిగదా?

దుర్యో:—సందేహ మేమి? ఆవిషయము మామయగు శకుని యును సహోదరుఁడగు దుస్ససేనుడును సప్రమత్తులై సర్వసన్నాహ ములు గావించుచున్నారు కాని సైన్యాధిపత్య విషయమున నీతో మంత నము గావించుటకే ముఖ్యముగా నిన్నిటకు రావించినది.

కర్ణు:—సరే! అదెంత. మనబలంబులకెల్ల వయోజ్యేష్ఠుడును విక్ర మాభిధుర్యుఁడునగు గాంగేయుఁ డుండెనుగదా! మనముపోయి వానికి

సర్వసైన్యాధిపత్యము గట్టి కడమువారిలో మహారథాతి రథనిర్ణయ మాతనిచేతనే నేర్పరిపింతమిది మనకెంతయును శ్రేయోదాయకము.

దుర్యో:—రాధేయా! దీనిరుపమానబుద్ధి విశేషంబున కెంతయు సంతోషమగుచున్నది రమ్ము. తాతయొద్దకు పోవుదము.

కర్ణు:—మంచిది నడువుము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

(తెర వ్రాలును.)

3వ, రంగము—ఏకాంత ప్రదేశము.

(విచారముతో భీముడు ప్రవేశించును.)

భీము:—ఆహా! కాలమెట్టులున్నదోగదా?

ఉ. ఎప్పటికింక దీఱుమద • భీష్మము జేతులలీటపోవ మా
కెప్పటి కబ్బుయుద్ధమిక • నెప్పటికీ పరితాపమారు నిం
కెప్పటి కేగుదెంచి వసి • యించు భుజంబున రాజ్యలక్ష్మి తా
నిప్పటికేమి చేసికొని • కృష్ణుడువచ్చునొకో రయంబునన్.

గోపాలకృష్ణుడు మాధర్మజు నభీష్టముదీర్ప రాయబారము దీర్ప హాస్తినాపురంబున కేగినదిమొదలు కార్యమేమవునోయను చింతాతిరేకమున రేయిసరిగా నిద్దురబట్టుటలేదు. ఇచ్ఛాహారములయెడనైనను మనసుపోవుటలేదు. అనుయోధనుడు పదివంతులు సంధికంగీకరింపడనియో నాతలంపు. ఒకవేళ సంధియేనిశ్చయింపబడిన మాయాశలు మరుభూమిలో వితితనవిత్తనంబుల భాతినిరర్థకంబులే యగును. భగవంతుడేమిచేయనున్నాడోగదా? ఇంతవరకువచ్చినపిదప నాధూర్తధార్తరాష్ట్రులతో

గలసిమెలసి ప్రవర్తించుటకన్న నేమహారణ్యంబులనైన నాకలంబులను గ్రసించుచు మృగములలో మృగయులమై ప్రవర్తించుటయేమేలు! (ఆలోచించి) అయిన నింతకు మాయన్నదమ్ముల యభిమతంబులెట్లున్నవో దెలిసికొనుట యత్యావశ్యకము. ఈపని మాకృష్ణుడు రాకమునుపే చేయవలయును. కావుననే నిదేబోయెదనుగాక!

(నిష్క్రమించును.)

(ఇది విష్కంభము)

(తెరవ్రాలును.)





సంగీత

# శ్రీకృష్ణరాయబారము

## షష్ఠాంకము.



### 1 వ రంగము — రహస్యమందిరము.

(ప్రవేశము:- ఉచితాసనములపై గూర్చుండి ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు, ద్రౌపది.)

ధర్మ:—తమ్ములారా! సంధియొనర్చు నిమిత్తము రాయబారియై పోయిన మన శ్రీకృష్ణదేవు డింకను రాలేదు. కారణమేమై యుండునో గదా?

ఉ. సాయముసేయగోరి కురు ♦ సభ్యుల వీటికి బోయినాడు నా
రాయణమూర్తి యింతకును ♦ రాడు, దురాత్ములు వారలేగతిం
జేయదలంచిరో మనము ♦ చేసినకర్మ మదెట్టులున్నదో
శ్రేయముగల్గునో తుదకు ♦ జేబడునో విపరీతకార్యముల్.

అర్జు:—అగ్రసోదరా! మీకాసందేహామేల? మనదేవకీ గర్భశుక్తిముక్తాఫల మెన్నటికిని మనకు శ్రేయము దలంచియే కార్యము నిర్వర్తించి వచ్చునుగాని యన్యథాదలంపడ నీయడు.

నకు:—పూజ్యా! సహోదరా! ఏవిధమెట్లులైనను మనకా లోకబాంధవుని యానతి యతిక్రమింపరానిదిగదా?

సహ:—అగ్రజా! సత్యము.

తే. గీ. అతడు సర్వకాలావస్థ ♦ లందు నెంచు
మనలక్షేమంబు భాగ్యంబు ♦ మహితకీర్తి
మేనబావ మాతృడె జూడ ♦ మేటిహితుడు
యదుకులోద్భవు డిమ్మల ♦ సదయమూర్తి.

ద్రౌప:—అగును మన మాముకుందుని యాజ్ఞ శిరసా వహింప వలయును. ఆమహనీయు డసాధారణ మాయామేయ ప్రభావిలాసితు డు. సదయ హృదయయుడు. పాండవపక్షపాతి, లోకైక...

భీము:—(అర్థోక్తిలో) అగును. సహోదరులారా! దూతయై పోయిన గోపాలుడు నిజముగా మనయందు దయామనస్కుడేయైన యెడల సమరము సంఘటించుకొనియే వచ్చును. అన్యథాయైనచో మన శాతని పలుకు లవిశ్వాసార్హములే. అతడు పాండవపక్షపాతి మాత్రమె గాదు. ధర్మపక్షపాతిగాకున్న కొఱగామియే.

ధర్మ:—భీమసేనా! అవి యేటిమాటలు మన కనుకూలుడైన సన్మార్గుడును గాకున్న దుర్మార్గుడునా?

ద్రౌప:—నాథునివాక్యములు 'పెట్టినపెండ్లి పెట్టుకున్నశ్రాద్ధ' మన్నట్లున్నది.

భీము:—నాయభిప్రాయ మేల సరిగాదు?

ధర్మ:—వృకోదరా! మనకామహాత్ము నుపదేశముకన్న విన్న యేమున్నది. ఆ కంసారి త్రిలోక వంద్యుడు. ధర్మసంరక్షణా దక్షుడు. నీవన్నట్లు ప్రాకృతమానవుడు గాడు.

గీ. ధర్మసంరక్షణార్థము • ధరణియందు
అవతరించి యదూద్వహు • డయ్యెనేడు
ఆది శ్రీమహావిష్ణువే • యరయనతడు
గాన; నాదేవునానతి • గడపవలదె?

భీము:— అట్లయిన మీకందఱకు సంధిరోగమే పట్టినదన్న మాట. ఆహా! యేమి కాలవైపరీత్యము. హా! విధీ! నీవెంతకూళవైతివి. సుక్షత్త్రియవంశజుల కెంత దైన్యస్థితి సంప్రాప్తపఱచి వంచించితివి. యుద్ధముఁ జేయఁజాలని యీభుజాబల సంపత్తియేల? ఈక్షాత్త్ర తేజమేల? ఈసుక్షత్త్రియ లాంఛనమేల? (గద నుద్దేశించి) ఓగదాదండమా! నీవీనాఁడీ భీమసేనునిచేత నిజముగా వంచింపబడినావు. అసమర్థుని హస్తము జేరి నీశక్తి నీటిపై జేవ్రాలు గావించుకొన్నావు. నిన్ను వంచించిన యీ దుష్టుని నీవింక బ్రతుకనీయకుము. (గదను నేలనుతట్టుచు)

మ. సకలక్షోణి వరాధినేతల శిర • స్థానంబులున్ వ్రియ్యవై
నికటాగ్రంబున రక్తకాల్వలు మహా • హేతిచ్ఛటల్ జాలగం
టికి జేకూర్పగజాలు నీవిపుడు ధా • త్రిన్ నన్ను చేరీవు వా
రకదుష్కీర్తి నెసంగినావు గదవే • ప్రాద్యద్గదాదండమా!

కావున నీవిదే మదీయశిరోతలంబు భిన్నభిన్నములు గావించి నీకసి దీర్చుకొనుము. (గద యెత్తుకొనును.)

(తెరలో)

చ. నిలునిలు! వాయునందన! యి • హీనపరాక్రమ! చాలుఁజాలు! నీ
తెలివికి సంతసంబయె మ • తిం దలపోయకు మాహవంబులే

దిలయను చీవు నీబలము ♦ నీరణరంగ విశారదత్వమున్
పొలుపుగ జూపుకాల మది ♦ పూనికవచ్చె వృకోదరాగ్రణీ!

భీము:—(తెల్లబోయి గద క్రిందబడవేయును.)

(అందఱును ఆశ్చర్యమున చూచుచుందురు)

కృష్ణ:—(పూర్వోక్త పద్యమునే చదువుచు ప్రవేశించును. (అందరును లేచి నిలబడి శ్రీకృష్ణుని గౌరవించి ఉచితాసనములపై గూర్చుందురు.)

ధర్మ:—బావా! దేవకీనందనా?

ఉ. క్షేమమె పెద్దతండ్రి? మము ♦ గావల ప్రేమమెలర్పగ జూచునా
భీమపరాక్రముండునుంగురుడు ♦ బెంపెసలారగనున్న వారె? దా
సేమమెనా సహోదరులు ♦ సింధువిభుండునుదక్కు బంధుగుల్
సేమమె? పౌరులివాసులకు ♦ సేమమె సర్వము తెల్పవే వెసన్.

మఱియు నీకు మార్గాయాసము గలుగలేదుగదా?

కృష్ణ:—బావా! ధర్మనందనా? అందఱును సేమముగనే యున్నారు. నాకును మార్గాయాసమేమియు గలుగలేదుగాని...

ధర్మ:—కానిమేమి? (ఆతురతపడును)

భీము:—కానియేమున్నది. కయ్యమువియ్యమై యీయయ్యె రొట్టెనేతిలో పడినది.

కృష్ణ:—బావా! వృకోదరా! నారొట్టగాదు. నీరొట్టె యోనేతిలోపడినది.

భీము:—(సంతోషము గనబరచుచు) ఆ, యేమి? యేమి? సంధిరోగము నిర్మూలమై సంగరము సేకూర్చి వచ్చితివా?

శ్రీకృ:—అట్లు చేయకున్న నీగదాదండ మూరకుండునా?

భీము:—(గంతులు వేయుచు)

చ. జననము సార్థమయ్యెగద ♦ సంగరమేఘటియిల్లె నప్డునా
ఘనభుజ దర్పమేర్పడ ప్ర ♦ కంపితదేహులజేసి చంపు వా
డను కురుధార్తరాష్ట్రముల హా ♦ టాహుటి పావకు డాత్మతేజమున్
బనుపడ కాననంబు జెఱు ♦ పందలకొన్న విధాన ధారుణిన్.

ధర్మ:—బావా! సంగతులు సవిస్తరముగా దెల్పుము.

శ్రీకృ:—బావా! ధర్మతనూభవా! నీయభీష్టమునకు భంగము రారాదను పట్టుదలతో నే నాకౌరవ సభామధ్యమున ననేకవిధముల గార్యము సానుకూలపఱుప ప్రయత్నించితిని గాని లాభంబు తృణమాత్రమైన లేకపోయె. తొలుదొల్త కురువృద్ధుండగు ధృతరాష్ట్రునకు జెప్ప వలసినంత జెప్పితిని. దురభిమానియగు దుర్యోధనునకును విస్తరించి జెప్పితిని. కర్ణ శకుని దుశ్శాసనాదులను మందలించి చూచితిని. భీష్మునకు కార్యముతెఱంగెరింగించి ద్రోణాచార్యాది గురుసత్తములకును దెలియపరచితిని. కాని ఫలము లేదేమి చేయుదును.

ధర్మ:—ఔరా! యేమి కాలవైపరీత్యము.

భీము:—(సంతోషము ప్రకటించును.)

అర్జు:—(చిరునవ్వు నవ్వుచుండును.)

సహ:—(పైన జూచుచుండును.)

నకు:—(తలయూచును.)

ద్రౌప:—అన్నా! ఆధార్తరాష్ట్రులు నీ కేమియు బన్నము గల్గింపలేదుగదా?

ధర్మ:—తరువాత నేమిజరిగినది.

భీము:—ఏమి జరుగును. వా రట్లు సంధికియ్యకొనక తిరస్కరింపగా ఈత డామూట యిక్కడకు జేరదీసినాడు.

ధర్మ:—తిమ్ముడా! నీవించుక సే పూరకుండుము.

కృ:—తరువాత నాసుయోధనుడు నాపై నీసువహించి సభనుండి కర్ణాదులతో నిష్క్రమించి యేమియో యాలోచించుకొని నన్ను బంధింప ప్రయత్నించెను.

ధర్మ:—ఎంతద్రోహము.

భీము:—అది వారి కండకావరము. ఆకండకావర మీగదాఘాతమునగాని జక్కపడబోదు.

అర్జు:—పాపాత్ములు. పరమాత్మనే బంధింప సాహసించిరే.

నకు:—వినాశకాలము దాపురించినప్పుడిట్టి బుద్ధులే తఱచుగా దుర్మార్గులకు గలుగుచుండును.

సహ:—పాపాత్ముల పాపశాసులు వృద్ధిపొంది వారి జన్మవృత్తిపుట్ట దుష్కార్యములగాని కూకటివేళ్లతో గూలనేరదు.

ద్రౌప:—అన్నయ్యా! నీవప్పు డెట్లు తప్పించుకొంటివి?

కృష్ణ:—అంత నేను విశ్వరూపము ప్రదర్శించి వారిని చెల్లాచెదరు గావించి నానభికుల యనుమతి గై కొనివచ్చితిని.

ధర్మ:—కట్టా! చివర కిట్టి చెట్టసంభవమైనది. సంగరము తప్పి ...ది గాదుగ...?

(తెరలో)

గీ. వంటకంబులు సిద్ధమై ♦ వరలుచుండె
ఆలసించిన జవిదప్పు ♦ నవియునెల్ల
వేగదయచేయుడయ్యరో ♦ వీరులార?
పదియునొక్కండు గంటలై ♦ పఱిగెనపుడె.

ధర్మ:—బావా! దేవకీనందనా! రమ్ము, భోజనము గావించిన తరువాత కడమసంగతులు విచారించుకొందము, రమ్ము.

కృష్ణు:—సరే! అట్లనే గానిమ్ము.

భీము:—నాకు సంతోషాతిశయమున నాకలి యగుటలేదు. మీరు పోయి భుజింపుడు.

కృష్ణు:—భీమసేనా! వట్టిసంతోషములు పెట్టుకొని భుజించుట మానితివా సమయమునకు కాళ్ళుచేతులు చల్లబడును. ఆలోచించు కొనుము.

ద్రౌప:—నాథా! రండు పోవుదము. వేళదప్పిన భోజనము, చవిదప్పిన వంటకములును నిష్ప్రయోజనములే గాక యనారోగ్య ప్రద ములుగదా?

ధర్మ:—తమ్ముడా! వృకోదరా! రమ్ము.

భీము:—సరే! అట్లయిన మీయందరి మాటల త్రోసివేయ వలయును.

(అందరును నిష్క్రమింతురు)

(తెర వ్రాలును.)

2 వ రంగము — ఆకాశవీధి

(ఒంటరిగా నారదుడు ప్రవేశించును.)

నార:—(తనలో) ఆహా! నాప్రయత్నము లిప్పటికిగదా ఫల వంతములైనవి. సమరముగూడ నేడే ప్రారంభమగును. నాకు గావలసి నంత కలహాశనము దొఱకును. ఈపాండవ ధార్తరాష్ట్రబలంబులు అనుప మానంబులు. (ముందునకు జూచి) అదిగో! ధార్తరాష్ట్రుల సైన్యపారా వారము. ఆహా! యెందరు వీరులు. ద్రోణాచార్యుడు, కృపుడు, అశ్వ ద్ధామ, భీష్ముడు, కర్ణుడు, వికర్ణుడు గోపాలబలము. అబ్బా! చూచు టకు కన్నులపండువుగా నున్నదే! (మరియొకవైపు జూచి) ఔరా! పాం డవుల కెంతసైన్య మున్నది? అదుగో ధర్మజ, భీమ, నకుల, సహదేవులు. అతడే మత్స్యభూపాలుడు. అడుగో దుష్టద్యుమ్నుడు. అర్జునుడు కాన రాడేమి చెప్పుమా? (పరికించి) అడుగో! ఆశ్రీకృష్ణ సారధ్యమున నెంత ప్రకాశించుచున్నాడు.

గీ. ప్రావృషేణ్య పయోధర ♦ పాళిమధ్య
మెఱపుతీవయుబోలె న ♦ మేయ ప్రతిభ
కృష్ణసారధ్య లాభంబు ♦ నెనగినేడు
వెలయుచున్నాడదిగో దా ♦ విజయుడుర్వి.

ఆహా! ఆనరనారాయణు లిప్పుడు జూచుట కెంతయు దర్శనీయు లై యున్నారు. ఆమహనీయుల దర్శనభాగ్యమున మదీయజన్మము ఫల వంతమైనది. నా యీ భూలోకసంచారము ధన్యతమమైనది. నేనింక నిచ్చట నుండకూడదు. యీమహావీరుల పరస్పర ప్రయోగశస్త్ర సంచ యముఃలు కర్మముజాలక నాకు దగిలెనా ప్రమాదముగాగలదు, నే నిం

క స్వర్గమున కేగి యచ్చటనుండి సావకాశముగ దర్శించి యానందింతుసుగాక!

(నిష్క్రమించును.)

(తెరవ్రాలును,)

(ఇది విష్కంభము.)

---

3 వ రంగము—స్వర్గము.

(ప్రవేశము: పరిక్రమించుచు మణికంధరమహేంద్రులు.)

మహే:—మణికంధరా! కౌరవ పాండవ యుద్ధప్రయత్నము లెంతవరకు జరిగినవి.

మణి:—దేవా! ఇరుబలంబులవారు సర్వప్రయత్నంబులు గావించుకొనిరి. సైన్యంబులు తదాధిపత్యములు యుద్ధప్రక్రమములు నిర్దేశము లైనవి. మన ధర్మరాజు శ్రీకృష్ణ ద్వితీయుడై తొలి దివసమున సుందరాత్రియే భీష్మాచార్యుని పాలికేగి కష్టసుఖములు వెడలుబుచ్చుకున్నాడు. ధర్మప్రవర్తకుడగు నాభీష్మ యోధాగ్రేసరుడు కనికరంబుగలిగి అర్జునుడు శిఖండిని ముందిడుకొని నాతో సమరంబుజేసిన నేనస్త్రసన్న్యాసము గావించి మీకు జయంబు నేకూర్తుననియె.

మహే:—ఆహా! భీష్మాచార్యా! నీసుగుణప్రశస్తి కడుంగడు ప్రశంసాపాత్రముగదా! వీరాగ్రేసరా!

గీ. పితృహితైకపరాయణ ♦ నుతుడవగుచు
సకల దైవతానీకంబు ♦ సంభ్రమింప

ప్రతినవ్యూనితివా జన్మ • బ్రహ్మచర్య
దీక్షగై కొని ధన్యాత్మ! • దిరముగాగ.

మణికంధరా! తరువాత నేమి జరిగినది.

మణి:—ప్రభూ! తరువాత నాశమనతనూభవు డట్లు భీష్మా చార్యునివలన వరంబు వడసి పదపడి గురువగు ద్రోణాచార్యుని సన్నిధి కరిగినాడు.

మహే:—ఆకుంభసంభవు డెట్లనుగ్రహించినాడు.

మణి:—దేవా! "తానత్యంత దుఃఖవార్త శ్రవణమున నస్త్రసన్యాసముగావింతు" ననివచించెను.

మహే:—బాగుబాగు! తరువాత తరువాత.

మణి:—ప్రభూ! యదుకులాభరణంబగు కంసారాతి యర్జున సారథ్యము వహించి సమరసమ్ముఖునిగావించి నాడుకాని...(సందేహించును.)

మహే:—(ఆత్రముతో) కానియేమి? త్వరగజెప్పుము.

మణి:—దేవా! యేమియునులేదు. మనపార్థుడట్లు సమరభూమి ప్రవేశించి యుద్ధారంభా త్పూర్వమే కురుసేన సర్వము నొక్కసారి దిల కించి ప్రకంపితదేహుడై యిందరి బంధుహితాప్త గురుమిత్రుల జంపి రక్తసిక్తమైన కూడుదిననొల్లననియు యుద్ధముమాని యేయరణ్యములందైన నాకలంబుల భుజించుచుకాలంబు బుత్తునని భీష్మించుక కూర్చున్నాడు. తరువాత నేమిజరిగినదో తెలియదు.

మహే:—అన్నా! యెంతక్లిష్ట పరిస్థితి సంభవమైనది. మాయర్జునుడు శౌర్యధైర్య సాహసోపేతుడేగాని వట్టిదయార్ద్రహృదయుడు!

క్షత్రియుడు శాత్రవులపట్ల దయాగుణము బ్రదర్శింపజెల్లునా! రమ్మి మనము వేగమే గగనభాగమునకేగి యదృశ్య మంత్రప్రభావమున తి రోహితులమై సమరసంగతు లారయుదముగా. (రెండడుగులు వైచి ని లచి) మణికంధరా! నీవు మన చమూపతిసన్నిధికేగి సైన్యము సిద్ధపరుప మని చెప్పితినని నాయాజ్ఞగా వచింపుము. అవసరమైనచో మన సేన పాండవ సహాయార్థము పంపవలయును. వేగముగాబొమ్ము.

మణి:—దేవా! చిత్తము.

(నిష్క్రమించును.)

మహే:—(పరిక్రమించుచుండును)

(తెరవ్రాలును.)

---

## 4వ. రంగము—యుద్ధభూమి.

(రథారూఢులై శ్రీకృష్ణార్జునులు ప్రవేశింతురు.)

కృష్ణు:—బావా! అర్జునా! అల్లదే యావంకను గన్నెత్తి జూడుము.

మ. అదుగో భీష్ముడు! అల్లదే గనుము శ ♦ ల్యద్రోణులన్ సూతజుం
డదుగో! కౌరవయూధ మయ్యదె రణ ♦ వ్యాపార పారంగతుల్ మా
గడిగాండ్రయ్యెడ తక్క భూవిభులవ ♦ ర్గంబద్దె వీక్షింపుమా
విడువంబోకుము ధైర్యలక్ష్మి రిపుల ♦ నేధింపు యుద్ధంబునన్.

అర్జు:—బావా! కృష్ణా! ఏమిది నేను వీరందఱితోడను సమరము గావింపవలసినదేనా? ఏమి కాలవైపరీత్యము? క్షాత్రధర్మ మెంత దయావిహీనమైనది.

సీ. తండ్రి చచ్చినదాది ♦ దయమమ్ము బెంచిన
శాంతనవుని యెట్లు ♦ జంపువాఁడ
ప్రేమ ద్రోణాచార్యుఁ ♦ విద్య జెప్పినయట్టి
గురునేకరణి భువిఁ ♦ గూలనేతు
సూతజు రాధేయు ♦ నే తగుదంచెట్లు
సమరరంగంబున ♦ సమయఁ జేతు
అన్నలుదమ్ములు ♦ నాధా ర్తరాష్ట్రుల
సంగరక్షితి నెట్లు ♦ చంపువాఁడ

గీ. అక్కటా! తక్కగలయట్టి ♦ యవనిపతులు
బంధుమిత్రాప్త వర్గమే ♦ భంగిగూల్తు
వాసుదేవ! వారలఁజూడ ♦ వడకుపుట్టె
కాళ్లుసేతు లాడుటలేదు ♦ కార్యమేది?

11 వ అనుబంధము.

కృష్ణుః—(తనలో) ఈయర్జును డింకను బంధుప్రేమపాశమును దెంపుఁజేసికొన జాలకున్నాడు. కావున వీనికి కొండొక వేదాంత ముపదేశించి కర్తవ్యనుముఖుని గావింపవలయు. (ప్రకాశముగా) బావా! ఫల్గునా! నీమాటలు వినుటచేత నాకు నవ్వువచ్చుచున్నది.

గీ. యుద్ధమొనరింప వచ్చి నీ ♦ వుద్ధతివిడి
పిరికి పందలాడెడుభంగి ♦ పల్కెదేల?
ఇంతియేనా? భవచ్ఛౌర్య ♦ మిహిహి! యనరె
జనులు నీమాట లివి విన్నఁ ♦ జాలుఁచాలు.

అర్జు:—ఎందఱు నవ్వినవ్వుదురుగాక! నేనిందఱు బంధుహితాప్తవరుల బరిమార్చి రక్తసిక్తమైన మైలకూడు దినుటకంటె ఘోరారణ్యముల కందమూల ఫలాదులు భక్షించుచుండుటయే మేలు.

గీ. వలదు రాజ్యంబు భోగంబు ♦ వాసుదేవ!
ఇంతమంది బంధులజంపి ♦ యెట్టులోర్తు
శ్రీలమాట దేవుడెఱుంగు ♦ జీవహింస
కారణంబైన నాకిట్టి ♦ కల్మియేల?

కృష్ణ:—(కోపమునటించి) అర్జునా! తెలియనివాడవు తెలియనట్లూరకొనక పెద్దవిజ్ఞానివలె తలయుమొదలులేని మిట్టవేదాంతము లాడెదవు. యుద్ధమున నీవు వీరలను జంపుదువన్న మాటయేమి? నీవ వీరలవల్ల జత్తువేమో యెవ్వడెఱుంగును. అదియుంగాక నేనెట్లు జంపుదుననుచున్నావు. చంపుటకునీవెవ్వడవు? శరీరధారికి స్వతంత్రింబులేదు. పూర్వకర్మానుభవమునుబట్టి కాగల యర్థంబులు కాకమానవు. ఆత్మయొకప్పుడునుగిట్టునదిగాదు. మానవుడు చినిగిన వస్త్రమువదలి నూతనవస్త్రముదాల్చినట్లు జీవుడు శిథిలమైన దేహమువదలి మఱియొండు దేహమున బ్రవేశించును. యుద్ధము చేయుననుటకు నీవెవ్వడవు? ఇది నావిధి. క్షత్రియులకు యుద్ధము కులధర్మము. తనకులధర్మము విడిచి మనరాదని పెద్దలు పల్కుదురు. కులభ్రష్టుడు కర్మఛండాలు డనబడును. జాతిఛండాలునకు ప్రాయశ్చిత్తము గలదుకాని కర్మఛండాలునకు ప్రాయచిత్తములేదు. కనుక నీవు యుద్ధముచేసి తీరవలయును. ఇవినీవను కొనునట్లు పాపకర్మముగాదు? కులధర్మము. ఏమందువు? యిప్పుడైన యుద్ధమున కంగీకరింతువా? లేదా? చెప్పుము?

అర్జు:—కృష్ణా! నీబోధార్కద్యుతిని నాయజ్ఞాన గాఢాంధకారము పటాపంచలై కర్తవ్య మూఢుడనై యుంటిని. నీచిత్తము వచ్చినట్లు గావించుటకు సంసిద్ధుడనైయున్నాను.

కృష్ణు:—ఫల్గునా! (అని భుజముమీద చేయి వైచి) నీవిప్పుడు ప్రశంసాపాత్రుడ వైతివి. ధైర్యలక్ష్మి తోడుత వరించి శాత్రవుల నిర్జించి విశాలసామ్రాజ్య మనుభవింతువుగాక! నీకింక గావలసిన దేమున్నది.

అర్జు:—అట్లయిన నిట్లగుగాక!

గీ. సంగరంబులోపల మాకు ♦ జయమొసంగి
'ధర్మమేవజయత' టంచు ♦ ధర్మవిదులు
పలుకు బల్కు లెవ్వేళల ♦ వెలయుగాత!
భరతవంశవ్యుల యశంబు ♦ వరలుసతము.

కృష్ణు:—తథాస్తు!

(అందరును మంగళము పాడుదురు.)

12 వ అనుబంధము.

ఇది శ్రీమద్భారద్వాజ పవిత్రగోత్ర లక్ష్మీనారాయణ
దీక్షితపౌత్ర, రాఘవజ్యేష్ఠపుత్ర సత్యవతీగర్భ
శుక్తి ముక్తాఫల, వినయవివేక ధురీణ
వెంపరాలాన్వయపయః పారావార
రాకాసుధాకర సూర్యనారా
యణమూర్తి కవిప్రణీతం
బైన సంగీత శ్రీకృష్ణ
రాయబార నాట
కంబున బంచ
మాంకము.

స ం పూ ర్ణ ము.



శ్రీ ర స్తు.

# అ ను బ ం ధ ము లు

---

## 1 వ అనుబంధము.

అర్జునుడు:—

మోహనరాగము—ఆదితాళము.

ఆహా! ఈపురములీలా
వర్ణింప నాతరమా ॥ఆహా॥
అంబరచుంబిత సౌధములూ
అభినవములౌ గనంజాలా ॥ఆహా॥
ఆలమందలచందములా
నందములయ్యె మదికి ॥ఆహా॥
నందనందన పారిజాతరాజముల్
చూచితి నాజన్మతరించెగదా ॥ఆహా॥

## 2 వ అనుబంధము.

ద్రౌపది:—

కాంభోజిరాగము—త్రిపుటతాళము.

ఏలీలసహియింతు కృష్ణా!
ఇకనాపరాభవము మరతునా ॥ఏలీ॥
పురుడులేని విక్రమములు పతులే
మిన్నకుండిన నేమిజేతునిక ॥ఏలీ॥

శౌర్యబన్నములు దీర్చనిమగలు
గలసతికిది కర్మమా ॥ఏలి॥

3 వ అనుబంధము.

కర్ణుడు:—

ఆనందభైరవిరాగము—చాపుతాళము.

చాలుజాలు నీప్రగల్భముల్
నోరుమూయుము కృపా! నీచా! ॥చాలు॥
పనికిమాలిన బింకములేలా
పలుమాటలు వలదు ద్విజాధమా ॥చాలు॥
సామర్థ్యమున్న సంగరంబునకు రారా
వాడియమ్ముల బిలుకుమార్తు ॥చాలు॥

4 వ అనుబంధము.

ధృతరాష్ట్రుడు:—

శ్రీరాగము—ఆదితాళము.

తనయా నీకిది మేలా? చేలా?
నాపలుకాదరింప జాగేలా ॥తనయా॥
అవినీతివర్తనము తగునా
పాండవేయుల పగధరనిమ్మా ॥తనయా॥
కానివారలపలుకుమా సుయోధనా
దురభిమానము నీకిటువలదు ॥తనయా॥

అన్నదమ్ములలో నారాటమేలా
నాహితము మది నూహింపుమా ॥తనయా॥

5 వ అనుబంధము.

దుర్యోధనుడు:—

కన్నడరాగము—త్రిపుటతాళము.

ఛీ! ఛీ! యికనేనిటులైతునా
అభిమానము కాలదన్నుదునా ॥ఛీఛీ॥
పాడిదొఱగి పలువురేకమై
నన్నిల దూఱుచుండగను ॥ఛీఛీ॥
పాండవాధములకు ధరనియ్యన్
అనుభవింతు నేనంతయు నొకడన్ ॥ఛీఛీ॥
వినను వినను వినను మీమాటల్
చేయుదు మీయిష్టమురీతిన్ ॥ఛీఛీ॥

6 వ అనుబంధము.

గాంధారీ ధృతరాష్ట్రులు:—

ఆనందభైరవిరాగము—ఏకతాళము.

భక్తజనావన శౌరీ! మురారీ!
పరిహరింపుము మాపాపౌఘముల్ ॥భక్త॥
హరినీవిశ్వరూపము గంటిమీ
మంటిమి ధన్యతములమై ॥భక్త॥

సారసనేత్రా! భక్తజనమిత్రా!

వందే! వందే! యదువంశభూషణా! ॥భక్త॥

7 వ అనుబంధము.

నారదుడు:—

శ్రీరాగము—ఆదితాళము.

భక్తజనవంద్యా! పరమపురుషా!

ఆదిమధ్యాంతరహితా హరీ! ॥భక్త॥

భవ్యచరిత! పాపశోషణా!

కావుము కావుము సారసనాభా ॥భక్త॥

ఆనందమయరూపా అంబుజనయనా

రమామనోహర వేదాతీతా ॥భక్త॥

8 వ అనుబంధము.

కుంతి:—

కళ్యాణిరాగము—మిశ్రమతాళము.

ఆహా! కష్టమె దాపురించెన్

కాలకర్మము లెట్లుండెనో ॥ఆహా॥

కూడుగుడ్డలు లేక నాసుతులు

కానలనున్న సంతసించితిన్ ॥ఆహా॥

తగవుమాలి యీకౌరవులు

ధరణి యివ్వక కష్టము దలచిరిగా ॥ఆహా॥

9వ. అనుబంధము.

కర్ణుడు:—

భైరవిరాగము—ఆదితాళము.

నన్నువిడువుమిక హరీ
పాండవులతో జేరజాల ॥నన్ను॥
జయాపజయములు దైవనిర్ణయముల్
సమరమె నానిశ్చయము జెప్పితిన్ ॥నన్ను॥
అన్నపానములిచ్చి బ్రోచిన
ఆసుయోధను వీడభావ్యమా ॥నన్ను॥

10 వ అనుబంధము.

నారదుడు:—

కళ్యాణిరాగము—మిశ్రమతాళము.

నమో నమో సురవైరి శిక్షా!
నమో నమో భక్తజనరక్షా! ॥నమో॥
అంబుధిశయనా! అనంగ జనకా
ఆదరించి బ్రోవుము ॥నమో॥
కార్య కారణ కల్పిత ప్రకారా
ఆకారరహిత అంబుజనయనా ॥నమో॥

11వ అనుబంధము.

అర్జునుడు:—

ఆనందభైరవిరాగము—చాపుతాళము.

అచ్యుతా! సమరము సేయజాలన్
ఇందఱ బంధులజంప నేరక ॥అచ్యు॥

రక్త సిక్తమైన మైలకూడు
కొంటకిపుడు భండనమా ॥అచ్యు॥

కూడుగుడ్డలు లేకపోయిన కానల
నాకలములు గొనుచుందుము ॥అచ్యు॥

రణమె కౌంతిధర్మమాగాక
అదినే సహింపజాలక ॥అచ్యు॥

12వ అనుబంధము.

—: మం గ ళ ము :—

మంగళం మధుసూదన
మంగళం సారసనయనా ॥మంగళం॥

ఆహరించి బ్రోవు మఖిలజీవుల
అవ్యయానంద పరమేశా ॥మంగళం॥

మంగళం మూర్తి కవి కృతులకు
సర్వదా జయమంగళం ॥మంగళం॥

స ం పూ ర్ణ ము.



శాక్సముద్రాక్షరశాల, రాజమండ్రి—1939.

# సంగీత సావిత్రి

గ్రంథకర్త:—చక్రావధానుల మాణిక్యశర్మగారు.

సోదరా! రైలుప్రయాణం కుటుంబసహితంగా చేస్తూన్నావనుకో! ఏమి తోచకపోడం నిజమే! అల్లాంటప్పుడు కల్లబొల్లి పత్రికలు కొనకు. ఇంటరుక్లాసులో ప్రయాణం చేస్తున్నప్పుడు దంపతులు కులాసాగా ఉబిసి పోకకు ఊకదంపుమాటలు చెప్పకునేమాట నిజమేనా? అలాటి కాలక్షేపముచేయక నీయర్ధాంగి చదువుకున్నదైనా కాకపోయినా నీకు సంసార విషయములో చేదోడువాదోడుగా నుండటం కోరుకుంటావు. కాబట్టి యిట్టిసలహాలను చదవడంతోటే నీభార్యకు కలుగజేయు సావిత్రినాటకం చదివి చెప్పు. సావిత్రీసత్యవంతుల ప్రేమ, వారి పెండ్లివిధానము, సావిత్రి ఋడత, ఆమె అత్తవారింటికి వెళ్లిన తరువాత వారింటికి పట్టిన ఐశ్వర్యము, ఆమె భర్తను బ్రతికించుకోవడానికి యమునితో చేసిన ధర్మయుద్ధము, నీభార్య వింటే నీసంసారం స్వర్గతుల్యమవుతుంది. నమ్ము. నీయింటబుట్టిన ఆడపిల్లలందరు సావిత్రులేయై నీకీర్తిని నలుదిశలా చిమ్ముతారు. నీవు 6 అణాలు ఖర్చుపెట్టి కొన్న సావిత్రియే నీయింట యేటేటా వెలుస్తుంది.

వెల రూ **0—12—0**

---

ఈశ్వరబుక్ డిపో, కర్రాఅచ్చయ్య అండ్ సన్సు, రాజమండ్రి.

# మా స్వంత ప్రచురణములు.

## నాటకములు.



| | |
|---|---|
| విజయబొబ్బిలి | 0 12 0 |
| శ్రీకన్యకాపరమేశ్వరీ విలాసము | 0 12 0 |
| మహారాష్ట్రవిజయము చ॥ మా | 0 12 0 |
| సంగీతజగన్మోహిని పా॥ బు | 0 12 0 |
| సంగీతసారంగధర దో॥ సీ | 0 12 0 |
| సంగీత పాశుపతార్జునము గా॥ సూ | 0 12 0 |
| సంగీత ప్రహ్లాద చ॥ మా | 0 12 0 |
| సంగీత శశిరేఖ అ॥ చం | 0 12 0 |
| రంగరాయకదన సమవాకారము కా॥ సా | 0 12 0 |
| బిల్హణీయము బు॥ వెం | 0 12 0 |
| స్త్రీసాహసము చ॥ మా | 0 12 0 |
| సంగీతజయంతజయపాలము | 0 12 0 |
| సత్యహరిశ్చంద్ర చ॥ మా | 0 12 0 |
| సైంధవార్జునము గా॥ సూ | 0 12 0 |
| బుద్ధిమతీవిలాసము చ॥ మా | 0 12 0 |
| శ్రీకృష్ణతులాభారము నే॥ గం | 0 12 0 |
| భూలోకరంభ చ॥ మా | 0 12 0 |
| ఆంధ్రపతాకము ద్రో॥ సీ | 0 12 0 |
| లంకాదహనము చ॥ మా | 0 12 0 |
| పాదుకాపట్టాభిషేకము చ॥ మా | 0 12 0 |
| పద్మవ్యూహము వెం॥ సూ | 0 12 0 |
| కనకతార ,, | 0 12 0 |
| లవకుశ ,, | 0 12 0 |
| భక్తకుచేల ,, | 0 12 0 |
| శ్రీకృష్ణలీల ,, | 0 12 0 |
| సతీసక్కుభాయి వ॥ సూ | 0 12 0 |
| హనుమద్రామసంగ్రామం | 0 12 0 |
| శ్రీరామజననము సీతారామ్ | 0 12 0 |
| శ్రీరామప్రవాసము ,, | 0 12 0 |
| శ్రీరామవిజయము ,, | 0 12 0 |
| శ్రీరామోద్యోగము ,, | 0 12 0 |
| వేశ్యాహితబోధిని ,, | 0 12 0 |
| ద్రౌపదీపరిణయము ,, | 0 12 0 |

అచ్చులోనున్నవి

| | |
|---|---|
| సతీఅనసూయ వి. శ్రీ. శాస్త్రి | 0 12 0 |
| సతీతులసి ,, | 0 12 0 |
| రామదాసు వెం॥ సూ | 0 12 0 |
| కాంతామతి ,, | 0 12 0 |
| పాండవ అజ్ఞాతవాసము | 0 12 0 |